శ్రీ

# వసుమతి

ఐదంకముల నాటకము.

ఇది

షేక్సుపియర్ మహాకవిచే రచియింపఁబడిన

మర్చెంటు ఆఫ్ "వెన్నీసు" నుండి

ఆచంట సూర్యనారాయణ రాజుచే

నాంధ్రీకరింపఁబడినది.

శ్రీమనోరమ ముద్రాక్షరశాల

రాజమహేంద్రవరము.

1908.

వెల ౫ అణాలు.

# పీఠిక.

---

శ్రీమద్భరతఖండమున సంస్కృతభాషలోఁ గొన్ని నాటకములను కావ్యములను రచియించి శాశ్వతకీర్తిఁ జెందిన కాళిదాసువలె హూణదేశమున నాంగ్లేయభాషలోఁ బెక్కునాటకముల రచియించి యఖండయశస్సాంద్రుఁడగు "షేక్స్పియర్" అను మహాకవి రచియించిన "మర్చెంట్ ఆఫ్ వెనిస్" అను నాటకమునకు భాషాంతరీకరణము. సర్వదేశముల విశేషప్రఖ్యాతిఁ గాంచిన యాకవినిగూర్చిగాని, యాతని పాత్రానుగుణమగు గుణపోషణముగూర్చిగాని, మఱియేవిషయమందుగాని విస్తరించి వ్రాయఁ బనిలేదు.

అత్తిలిగ్రామమందున్న పాఠశాల వేసవికాల విశ్రాంతికై మూయఁబడునపుడు బాలురు చేయు వైశాఖప్రజాసమయమున పురవాసులు వచ్చి గౌరవమందుట యాచారముగాఁగా నాన 1891 సం॥ మే నెలలో నట్లు మూయునప్పుడు బాలురచే నేదేని నొక వినోదము సేయింపఁదలంచి యీనాటకమందలి నాలవయంకము తెలుఁగుబాసను మార్చి పురవాసులయెదుట నాడించితిని. నాటకమంతయు నిట్లు మార్చిన బాగుగనుండునని పెక్కుమంది యభిప్రాయము నొసఁగుటచేఁ గ్రంథమంతయు భాషాంతరీకరింపఁ గడంగి యాయేఁటనే ముగించితిని.

ఒక భాషలోని నాటకము వేఱొకభాషలోనికిఁ దెచ్చుట దుస్తరముగా, నాటకమందుపయోగింపఁబడు కథలలోగాని, భాషలోగాని యేమాత్రమైన సంబంధము లేని హూణభాషతో రచియింపఁబడిన నాటక మాంధ్రభాషలో రచియించుట మఱింత దుర్లభమని యెఱిగియుఁ జిత్తచాపలతచే నట్టికార్య మూనినాఁడను. ఆంధ్రభాషలోనికి మార్చునపుడు దేశానుగుణముగ నాచారములు కథలు నెలకొల్పుటయు, భాషానుగుణముగ నామములు పాత్రముల కిడుటయు నుత్తమమని తలంచి, బ్రా॥మ॥ రావుబహదర్ కందుకూరి వీరేశలింగము పంతులుగారు రచించిన పుస్తకములు కొన్ని తీసికొని కథ చెప్పవలసినపుడు, మన పురాణములలోని సందర్భములకుఁ దగినవియే చెప్పుచు, అట్లు వీలులేనివి విడుచుచు, నాంధ్రీకరించినాఁడను. ఇంకొకటి. నాంది మననాటకములలో నున్నది కాని హూణనాటకములలో లేదు. మన దేశాచారములే యంతట నవలంబించునపు డిందుమాత్ర మేల మానవలయునని తలంచి నాందిని చేర్చితినే కాని దీనివలన నాటకమునకు మఱింత వన్నెవచ్చునని కాదు. ఆ వన్నె వచ్చినదో రాలేదో తెలిసికొనుటకు చదువరులే ప్రమాణము. కథనుమాత్ర మెచ్చటను మార్చలేదు. క్రిస్టియనులకు యూదులకు సరిపడనట్లు కవి చెప్పఁగా, హిందువులకు బౌద్ధులకు నట్లిడినట్లు మార్చితిని. రెండవయంకములో దండ్రి కుమారులకు గొంచెము వేళాకోళము వ్రాసియుండఁగా బావమఱఁదులకని మార్చితిని. యంకములో వసుమతిని వివాహమాడవచ్చి

న తరుణవయస్కుఁడు మందసము తెంచుటలో తాను బంగారపుపెట్టె గొందలఁచి సీసపుపెట్టె నీసడించుము "ఆమె శవముపై కప్పు బట్ట" లని య వచ్చునని, క విడిచిన బట్టలని స్మార్తివిని ఇట్టిక్కడక్కడ మార్పులున్నను క చెడకుండ నుంచి న నాకు హూణభాషలో విశేషప్రజ్ఞ లేకుండుటను, ఈనాటకము నర్థముచేసికొ నుటలోఁ బెక్కు లోపము లుండవచ్చును వాని దెలిపినవారికి వందనము లిడుచు నిందుండు వ్యాకరణాదిదోషముల మన్నింపఁ బండితోత్తములవేడుము. ఈనాటక క ను సంగ్రహముగాఁ దెలిపి యీ పీఠిక ముగింతును.

చార్వాకుఁడును సత్యకీర్తియు ఋణప్రదాతలు. చార్వాకుఁడు కఠినషరతుల తోఁ బత్రముల వ్రాయించుకొని యంతకఠినముగానే సొమ్ము జమచేసికొనును. సత్య కీర్తి పదయాత్ముఁడగుటచే చార్వాకుని వ్యవహారమున కాటంకము కలుగుచుండెను. అందుచే నుభయులకును వివాద సత్యకీర్తి సర్వస్వమోడలనుండి చేత దమ్మిడియైన లేనిసమయమున నాతని ప్రియమిత్రుఁడగు చంద్రమౌళి వసుమతిని వివాహమాడఁబో వ నీతని బదులిమ్మని యడుగగాఁ దనయొద్ద ధనములేమిని చార్వాకునియొద్ద బదులు చేయవలసివచ్చి మూఁడు నెలలవాయిదా దాటినయెడ సత్యకీర్తి తనగుండెలలో నేదు మాంసము చార్వాకుఁడు కోసికొనుటకు పత్రము వ్రాసి ... వేలమాడ లప్పుతె కొనెను. గ్రహచారవశమున గడువులోగా నోడలుచేరమి గడువుదాటుటచే నై యిన నీతని ప్రాణములఁ గొనఁజూచు చార్వాకుఁ డెంతసొమ్మియిన గైకొనక మాంసమే కావలయునని పట్టుపట్టి దావా తెచ్చెను వసుమతి న్యాయవాదివేషముతో నా య వమునకు వచ్చి పత్రమే కావలెనుగాని సొమ్ము వద్దని చార్వాకునిచే ననిపించి ప్ర కారము నెత్తురుచుక్క కారకుండఁ గోసికొమ్మని యుక్తిచెప్ప వాని యభిప్రాయము సాగవచ్చినది కాదు. తరువాత సత్యకీర్తి విడుదల చేయబడెను. వసుమతి న్యాయ వాదిగా నున్నపుడు తనభర్తనుండి గైకొనిన యుంగరమునకుఁ జమత్కారముగాఁ దగ వులాడి తుదకు సంతోషముతో తానే న్యాయవాదినని తెల్పెను. సత్యకీర్తియోడలు ను ఉపానుబంధ ఏడి రేవుచేరినవి. నాటకము సుఖముగా నంతమయినది. ముఖ్యకథ యిది. ఈనాటకమును స్నేహముపురస్కరించుకొని నాసహపాఠియు మనోరమపత్రి కాధిపతియు, ప్రఖ్యాతకవియునగు మహారాజశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహమూర్తిగారు తమ నాటకముఖమున దీనిఁ బ్రచురించినందున కనేకవందనము లాచరించుచున్నాఁడను.

అలిలి — ఇట్లు

190- జూలై — ఆచంట సూర్యనారాయణరాజు.

ఈనాటకమున వచ్చు పాత్రములు



పురుషులు.

**Antonio** సత్యకీర్తి.
**Bassanio** చంద్రమౌళి—వసుమతీ భర్త.
**Gratiano** వసంతకుఁడు—చతురికా భర్త.
**Salarino** హారదత్తుఁడు.
**Salanio** చారుదత్తుఁడు.
**Lorenzo** ప్రభాకరుఁడు—పద్మినీభర్త.
**Sholock** చార్వాకుఁడు.
**Tubal** వినయంధరుఁడు.
**Launcelot Gobbo** గోపాలదాసు.
**Old Gobbo** కృష్ణదాసు.

స్త్రీలు.



**Portia** వసుమతి.
**Nerissa** చతురిక—వసుమతి చెలికత్తె.
**Jessica** పద్మిని.

కథానుగుణముగా మఱికొందఱు వత్తురు.



శ్రీరస్తు.

# వసుమతి.

## The Merchant of Venice.

### ప్రథమాంకము.

#### నాంది.

సూత్రధారుఁడు.—

ఉ. శ్రీలఁ జెలంగి నిష్కలుషచిత్తము గల్గి పరోపకారియై
శీలము మైత్రి భూతదయ చెన్నగు భక్తియు సత్యవాక్య స
త్పాలన గల్గు ధన్యునకు భద్రము సంగుచుఁ బ్రోవునిందిరా
లోలుఁడు కేశవుం డఖిలలోకనుతుం డిడు మీకు సౌఖ్యముల్. 1

చ. పలువురు రాజనందనులు వశ్యము కాదని చూచుచుండఁగా
నల ద్రుపదాత్మజాపరిణయంబునఁ బన్నిన మత్స్యయంత్రమున్
సులువుగ నూడఁగొట్టిన ఘనుండగు పాండవమధ్యము న్గుతూ
హలమునఁ గాంచు కృష్ణు డనయంబిడు మీకు మస్త సౌఖ్యముల్. 2

తలంచిన కార్యములు భగవంతుని యనుగ్రహమున నే నెఱవేఱవలయును. (సభికులఁ జూచి) పూజ్యులగు సభాసదులారా! మీయందతితో నేనొక విజ్ఞాపనముఁ జేసికొనుచున్నాను. నేఁటిరాత్రి నీసభాస్థలికిఁ దమ దర్శనముచే వన్నె తెచ్చిన సత్పురుషులగు తమకు వినోదముగా నుండుటకై యేదేనినొక్క నాటకప్రయోగమున కభ్యనుజ్ఞ నీయ వేఁడెదను. (పుష్పముల సభికులపై వెదజల్లును) (తెరలోధ్వని) (ఇంచుక సేపూరకుండి)

రే. వేఱుగ మాటలచే ననుజ్ఞ నీయవలయునా ?

క. వేసములు వచ్చునెపుడం
చాసించుచు నుంట నాట కాలోకనకా
ర్యాసక్తులు మీచూపులె
మీసమ్మతిఁ దెల్పుచుండె మిక్కిలి ప్రీతిన్.

కావున నింక నాలస్యమేల? నటీ! చేయియూరకున్నదా నొక్కసారి యింటరమ్ము

(అందెలచప్పుడు వినఁబడ నటి యెక్కడికో పోవును)

ఏమిది. నాపిలుపు వినియుఁ జేయు యుపాయముగానక కాఁబోలు నటి యెచ్చటికో య రుగుచున్నది లేక వినకయుండునా?

క. తొందరపని యుండిన వా
రందఱకిని లేని బధిర మబ్బునుగాదే!
అందెల చప్పుడు వినఁబడ
సుందరి నాపిలుపు వినియుఁ జోద్యముగఁ జనెన్.

ఇంకొకసారి పిలిచెదను—నటీ! యెంత తొందరపనియున్న నొక్కసారి మా విని పొమ్ము.

(నటి ప్రవేశించును)

నటి—ఆర్యపుత్రా! నమస్కారము. చేతిలోఁ గలిపినకుంకుమ యుండుటచే సుభద్రకు బొట్టుపెట్టి చక్కవచ్చితిని. ఆలస్యము మన్నింపుఁడు.

సూత్ర—ఏమీ? సుభద్రకు బొట్టెట్టి? ఏసుభద్ర?

నటి—నేటిరాత్రి సజ్జనోత్తములగు సభికుల కానందము కలుగుటకై నాటకమేని యాడవలయునని నిన్న సెలవిచ్చియు, మఱచితిరా? ఈనాటకమని నిర్ధారణచేమి, హృదయరంజకమగు భారతకథలలో ద్రౌపదీపరిణయమో సుభద్రాపరిణయమో చూడఁబోదురని తదనుకూల పాత్రముల సిద్ధపఱచుచుంటిని.

సూత్ర—భారతకథలనే వినిపింపఁ దలంచితివా?

నటి—నాథా!

తే. గీ. కనఁదలంచినఁ గొడుకులఁ గనఁగవలయుఁ
దినఁదలంచిన గారెలఁ దినఁగవలయు
వినఁదలఁచిన భారతమునే వినఁగవలయు
ననెడు లోకోక్తి మీ రెప్డు వినఁగ లేదె?

సూత్ర—వింటినిలే. కూఁతులుమాత్రము పుట్టి యల్లుండ్రచే బాధింపఁబడిన వాస్తుచేతను, ఇతర మధురాహారములుగాని, యితర కథలుగాని లేని కాలమున కల్పింపఁబడిన లోకోక్తి.

తే. గీ. విసిగియున్నారు వీరలు వినియువినియు
భారత కథలు రాములవారి కథలు

వినిన దానిని వినిపించి వీరి మనసు
లెట్లు రంజిప నేర్తువే ? యింతి నీవు 6

నటి—ఇపుడు సర్వప్రదేశములకు రాకపోకల కనుకూలముగ మార్గము లేర్పడి యుంటచే, మనదేశమందు రచియింపఁబడిన నాటకము లెక్కడనో యొకచోట వీరలు చూచియేయుందురు. కావున నింక వీరు వినని కనని విదేశనాటక మాడవలయు. పరదేశముల నాటకము లెక్కడ ?

సూత్ర—ఇంతీ ! నీ కేమియు తెలియంగవు.

చ. తెలివినిగ్గువారు మనదేశములోననె యుందురంచు వా
రలె జనులెల్ల మెచ్చఁదగు గ్రంథములన్ రచియింపఁజాలువా
రలనుచు నెంచఁబోకుము ధరన్ తెలి వొక్కరి సొమ్ముకాదు సూ
కలికిరో ! యెల్లదేశములఁ గ్రాలుచునుంద్రు కవీశపండితుల్. 7

హూణులదేశంబగు శ్వేతద్వీపమందు మనలోఁ గాళిదాసువలె ప్రఖ్యాతిఁగాంచిన "షేక్సుపియర్" అను నొక మహాకవి యెన్నియో నాటకముల హూణభాషను రచియించియుండెను. అందొకటి నేడు ప్రయోగింతమని యభిలాష.

నటి—సరే. తలంచిన పని సుకరముగా నెఱవేఱెడి !

తే. గీ బదులనెలకొల్పి హూణులభాష నేర్చు
చున్న వేయిలొక్కఁడు నేర్చియుండునేమొ
గాన ఫల మొక్కటూడిన మానుకొన్న
నిద్రమానుక వీరిట నిలువనేల ? 8

సూత్ర—నటీ. ఆ చిక్కులేదు. అత్తిలిపురవాసి యగు "ఆనంట సూర్యనారాయణరాజు"చే నాంధ్రభాషలో "వసుమతి" యను పేర వ్రాయఁబడిన తన్మహాకవి రచించిన వెనీసు వర్తకనాటకముఁ బ్రయోగింతము.

నటి—ఆనాటకము క్రొత్తది. ఇప్పుడే ప్రయోగింప నెట్లనువుపడును ?

సూత్ర—భోజ ముఖాంబుజ దర్శనమునఁ గవి ము వచ్చునట్లు గుణగ్రహణపరీణులగు నీసజ్జనులఁ గాంచినంతనే మనవారికా ము క్కలురాకపోవు.

నటి—ఇదివఱకే యాలస్యమైనది. తిరిగి పాత్రములు సిద్ధముచేయు నారంభించిన నీకాలవిలంబన కీ సభవారోర్తురా ?

సూత్ర—ఆ యిబ్బంది లేదు. ఇదివఱకే పాత్రములు సిద్ధమయినవి.

నటి—ధర్మరాజు, అర్జునుఁడు, సుభద్ర మొదలగు కొన్ని ముఖ్యపాత్రలను

కొన్ని చిల్లరవేసములును సిద్ధమయినవి.

సూత్ర—నాటకమారంభించుట కాపాత్రములు చాలును. ఆచారానుసారము గా సకలర్తురాజమని పేరొందిన వసంతఋతు వర్ణన మొనరింపుము.

నటి—సీ. మారుతుండనుదొంగ మావిగుత్తులచేత మంత్రించి పైఁజల్లు మత్తుమందు
కోర్కె లతిశయింపఁ గుందంబు దరిఁజేర సరళమైయుండి దాపరుషమగును
మారశాసనమును మన్నించుచు గృహస్థులాటకుఁ జేతురు యత్నములను
వరపద్మినీప్రభాకరుల చెల్మికి లోకమపహసించుగతి చెట్లలరుఁబూల
తే. గీ. సంతసంబయ్యెడు వసంతసమయ మప్పుడు
వసుమతి ధరించు మార్పానవాలు పెట్ట
సత్యకీర్తినిఁ జెందిన చంద్రమౌళి
కైన శక్యంబు గాకుండు టద్భుతంబు. ౧

సూత్ర—ఋతువర్ణనమును మిషను నాడఁబోవు నాటక కథ సూచించితివి. ఇదియే జయసూచకము. ధర్మరాజును సత్యకీర్తిగాను, అర్జునుని చంద్రమౌళిగాను, సుభద్రను వసుమతిగాను రమ్మనుము పొమ్ము.

నటి—నాథా ఒక్కమాట—ధర్మరాజే నాటకములోనయిన శృంగారవీరరసముల జోలికి బోడుగదా—ఈనాట—

సూత్ర—సత్యకీర్తి యా ధర్మరాజే. త్వరగా రప్పింపుము.

(నటి నిష్క్రమించును).

సూత్ర—(చూచి) అదిగో ధర్మరాజుమబోలు సత్యకీర్తి మిత్రులతో వచ్చుచున్నాడు. నేఁబోయి కొదువపాత్రములు సిద్ధముచేసెద.

(నిష్క్రమించును).



శ్రీరస్తు.

# వసుమతి.

## ప్రథమాంకము.

### రంగము ౧.

[సత్యకీర్తి—హరదత్తుఁడు—చారుదత్తుఁడు ప్రవేశించుచున్నారు].

సత్య—నిశ్చయముగ నేనేల చింతగానుంటినో తెలియదు.

ఉ. ఇంతటిచింత కేమి కత మేగతి నాకుఁ దటస్థమైనదో
స్వాంతములోన నెట్లు సొఱఁబాఱెనో దాని స్వభావమేదియో
యింతయు నే నెఱుంగవలె నెంతో ప్రయాసముమీఁద గాని యా
వంతయు నన్ను నే నెఱుఁగనంతటి మూఢుఁడనైతి నక్కటా. 1

హర—ఇపుడు నీధ్యానమంతయు సముద్రముపై నడయాడుచున్నది. సముద్రాధిదేవతలోయన నొప్పు నీయోడల వైభవమేమని చెప్పుదును ?

చ. అలసులు గొప్పవారిఁ గని యర్హపుమన్ననఁ జూపఁ దప్పఁగాఁ
దొలఁగి నమస్కరించుగతిఁ దోరపుచాపలనొప్పు నీదునా
కలకెదురైన దోనె లాడికంబునవంగి సలాముచేసి వ
ట్లఱెడు వీచికాచయ మహాంబుధిఁ బొట్రిలుచుండి పోవుచున్. 2

చారు—అయ్యా! నామాట నమ్ముఁడు. నేనే యోడవ్యాపారము చేయుచుంనేని నాధ్యాన మెల్లపుడు సముద్రముమీఁదనే యుండి కనఁబడినచోట్ల గడ్డిపరక వతఁబుచ్చుకొని గాలి యేదిక్కుగా వీచుచున్నదో గ్రహించుచు, దేశపటములలోవులు, రక్షణస్థానములు, మార్గములు మొదలగునవి చూచుచు, భయనిదానమగు ప్రస్థలమును చూచునపుడెంతో విచారమొందుదును.

హర—ఓడవ్యాపారము నేనును చేయుచుంటిని కావున

తే. గీ. వేడిచారు చల్లపడంగ విసరునపుడు
జలధిపై నెట్టి పెనుగాలి సంభవించి

కౌండ కేహానికర్గించె యటంచు
వణకెదు చలిజ్వరమే వెస వచ్చినట్లు 3

తే. గీ. ఇసుకలోఁ గారుకోనినాక యెంతో యొలఁగఁ
గొననడుముకంటెఁ గ్రిందొదఁ దన సమూధిఁ
గాంచుటకు వ్రాలె ననునూహ కలుఁగుకతన
నిసుక గడియారమును జూచి నిచ్చగింపు 4

తే. గీ. గుడి శిలామంటపముఁ జూడఁ గొండతగిలి
యోడ పగిలి పరిమళ వస్తూత్కరంబు
జలము పాలయి పట్టువస్త్రంబులెల్లఁ
గషలికిని: గట్టఁబెట్టిన వడుపుతోఁచు 5

ఇంతెందుకు ? క్షణము నిక్షేపము — క్షణము విక్షేపము. ఇట్టనుకొందమని యను కొంటినా ? అట్టి యుపద్రవమే తటస్థించిన విచారింపకుందునా ? ఇంకఁ జెప్పకుము, నిజముగా సత్యకీర్తి తనసామగ్రికే విచారముగా నున్నాఁడు నే నెఱుఁగుదును.

సత్య — అదికాదు నామాటనమ్ముము.

మ. ఒకటే నౌకను నమ్మలేదు మఱి నాకున్నట్టి వాణిజ్య మం
తకు రేవొక్కటె కాదు నాదు ధనమంతం జేర్చి యీయేఁటి వ
ర్తకమందే సరిపుచ్చలేదుగద చింతం గూర్పఁగాలేదు వ
ర్తకమర్దానికి నే గృతజ్ఞుఁడను మద్వాక్యంబుల న్నమ్ముఁడీ. 6

నాసామగ్రికై యావంతయుఁ జింతలేదు

చారు. — అట్లయిన నీకుఁ గామవిచారమేమో.

సత్య — ఛీ. ఛీ.

చారు — కామబాధచేతను కానియెడల నీవు సంతోషముగా లేవుకావున విచారముగా నుంటివని కొనవలయును ఇట్లైనప్పుడు, త్రుళ్లుచు, సంతోషముగా నున్నపుడు విచారముగా లేవని తలంపవలయును ఆహా ! సృష్టిలోఁ జిత్రమగు జనులున్నారుగదా ! ద్విముఖుండగు నగ్నిహోత్రసాక్షిగాఁ జెప్పెదను. కొందఱెల్లపుడు కనులమోడ్పి యుపాంగము "ఈఁ" మనఁగానే చిలుకలవలె నోరుతెఱతురు. మఱి కొందఱు మిరపకాయ పలకమూఁటిన వారివలె ముఖములుపెట్టుకొని భీష్ముఁడంతటి వాఁడు మెచ్చుకొను హాస్యమునకైనను చిఱునవ్వుగ నైనఁబలువిప్పరు.

(చంద్రహాసి, వసంతకుఁడు, ప్రభాకరుఁడు ప్రవేశించుచున్నారు)

చారు.—నీప్రియబంధువగు చంద్రమౌళి, వసంతక ప్రభాకరులతో వచ్చుచున్నాఁడు ఇంక నీకు మంచి సహవాసమున్నది కావున మేము పోయివత్తుము.

హార.—నీప్రియతములగు మిత్రులు రానియెడల నీకు సంతోషము కలుఁగువఱకు నేనే యుండువాఁడను.

సత్య.—నాకు మీరును ప్రియతములే. మీకేదో పనియుండనోపు. దానిని సందు చేసికొని వెళ్లుచున్నారని తలంచెదను.

హార.—ఆర్యులారా! మీకు వందనములు.

చంద్ర.—ఆర్యులారా! మనము తిరిగి యెపుడు సంతోషముగాఁ బ్రొద్దుపుత్తము. మీరు బొత్తుగాఁ గ్రొత్తవారగుచున్నారు. ఆలాగున నుండుట న్యాయమా?

హార.—తీఱికయున్నపుడు దర్శనము జేసెదము.

(హారదత్తుఁడు చారుదత్తుఁడు నిష్క్రమింతురు.)

ప్రభా.—చంద్రమౌళీప్రభూ! మీరు సత్యకీర్తిని గలిసికొంటిరి. కావున నింక మే మిద్దఱముకూడఁ బోయెదము భోజనమున కెక్కడఁ జేరవలయునో మఱువకుఁడు.

చంద్ర.—సరే. మంచిది.

వసం.—సత్యకీర్తీ

తే. గీ. కానుపింతువు స్వస్థతలేనియట్టు
లావరింతువు జనవాక్య మధికముగను
వెరవునన్ కొసరి కొసరి బేరమాడు
దానిలోననె నష్టంబు తఱుచుగలుఁగు. ౭

మిత్రమా! నీకుచాల మాఱితివి నమ్ము నామాట.

సత్య.—వసంతకా! లోకము నెట్లు చూడవలయునో యట్లే చూచుచుంటిని

తే. గీ. పెద్ద రంగస్థలంబు పృథ్వీతలంబు
వేషధారులు జనులెల్ల విసువులేక
యెవని కథయెట్టిదైన విన్పింపవలయు
వ్యసనకరమైన కథనాకు వంతువచ్చె. ౮

వసం.—అట్లయిన నేను విదూషకుండ నయ్యెదను. నా ముఖము ముడుతలు పడినను నవ్వునట్లు కొనదు. చింతను చెంతఁ జేరనీయక హాయిగఁదిని త్రాగితిరెదను.

తే. గీ. ఒడల బలముండి జనుఁడూర కుండ నేల
రాతఁ జెక్కిన తాత విగ్రహమువోలె
మేలుకొనియుఁ గన్మూసి కామినులు లేని
గోడుపడ నేల చిఱచిఱ లాడుచుండి. 9

సత్యకీర్తీ! నీపయి నాకుంగుప్రేమ కొలఁదిఁ జెప్పుచుంటిని. వినుము. లోకములోఁ గొందఱు నీటినిలకడచేత. బాకుడుపట్టిన చెఱువువలె ముఖవర్ణములు మార్చి లోకులు తమ్ముబుద్ధిమంతులనియు, వివేక మహితులనియు, గాంభీర్యశాలురనియు ననుకొనునట్లు మౌనము బూని "మాదృష్టి దివ్యదృష్టి (మేము చెప్పినదే వేదము.) మామాట కెవ్వరెదురాడరా"దని స్వోత్కర్ష ప్రకటించుకొనుచుందురు. మౌనము ధరియించి యుందురు కావున నట్టి ఖ్యాతి బడయుదురు కాని గ్రహచారవశమున వారెప్పుడయిన నోరు తెఱచి మాటలాడిరేని కర్ణకఠోరముగనుండి గుట్టుబయల్పడి వట్టిశుంఠలని వారి నందఱు నవ్వుదురు. ఈవిషయమై యింకొకసారి సాంతముగాఁ జెప్పెదను.

తే గీ చింతయను గాలమును వేసి, చిత్తమను జ
లాశయంబుగలంచుచు, నాశతోడ
జనుల మంచియభిప్రాయ మనెడు చేప
పట్టుటకు నింతశ్రమయేల పడెదవీవు 10

ప్రభాకరా! ఇంచుకసేపు సెలవుగైకొమ్ము. భోజనానంతరము నాహితోపదేశము ముగింతును

ప్రభా — భోజనసమయమువఱకు మిమ్మువిడిచెదను. వసంతకుఁడు మాటలాడుచుండుట నేను మాటాడ వీలుపడమిచే నాతఁ డభివర్ణించిన మూగ మతిమంతులలో నొక్కఁడను కావలసివచ్చినది.

వసంత — ఇంక రెండేండ్లు నాతో సహవాసము చేసితివేని నీమాటధ్వని నీకే వినఁబడకపోవును.

సత్య — మంచిది పోయిరండు. ఇందు చేతనయిన నేను వక్తనయ్యెద

వసంత — మంచిమాట చెప్పితివి. మౌనము నోరులేని పశువులకే తగును.

(వసంతక ప్రభాకరులు నిష్క్రమింతురు.

సత్య. — ఇందు యుక్తి యేమయిన గలదా.

చంద్ర. — ధర్మపురిలో నీతనికంటె వ్యర్థాలాపములాడెడి వాఁ డింకొకఁడు లేఁడు.

తే గీ పొల్లు రెండుగంపలు దినమెల్ల వెతకి
రెండుగింజలఁ గనిపెట్టు రీతి రెండు
యుక్తులుండు నేమో వీనియుక్తులెల్లఁ
బరగవిమర్శింప, శ్రమకును దగనిఫలము. 11

సత్య — మంచిది. నీవు రహస్యయాత్రకేసి క్షేత్రోత్సవము చేసికొనఁదలఁచిన యాకాంతాలలామ యెవ్వతె? నేడు తెల్పెదనంటివిగదా !

చంద్ర.—సత్యకీర్తి ! ఘనుఁడనని యనిపించుకొనుటకై దంభముగా వచ్చింది నాయాస్తితో నాపరపతి యంతయుఁ జెడఁగొట్టుకొనిన యంశము నీవెఱుంగనిది కాదు ఇప్పటికిని నాకాబుద్ధి మఱలకున్నది అప్పు డధికవ్యయము చేసి యప్పులపాలై యిప్పుడు వానినుండి యెట్లు గౌరవముగా విముక్తుఁడ నగుదునాయని చింతించుచుందును. సత్యకీర్తీ! నీకు ప్రేమయు ధనమును సరిగా ఋణపడియుంటిని. నీకు నాపై నుండు ప్రేమ మూలముననే నాకు ఋణవిమోచనము కలిగి, మనోరథ సిద్ధిలభించి నాభారము తగ్గునని నమ్మకము గలదు.

సత్య —నాప్రియమయిన చంద్రమౌళీ!

తే. గీ. సంగతేదియో నీవు చెప్పంగదయ్య
యదియు నీవలె నే గౌరవార్హమయిన
దానికైనాదు ధనము సాధనము లెల్ల
ప్రాణమైనను వినియోగ పఱతునమ్ము. 12

చంద్ర—చ. పిన్నతనమందు నేను విలువిద్దను నేర్చుచు వేసినట్టి తూ
పును మఱలం గనుంగొనక పోయిన తోనె మఱొక్క బాణమున్
మును పటిరీతినే పఱపి పోయినత్రోవను జాగరూకతం
గనియటకేగియున్ దఱచుగాఁ గనుచుండెడివాఁడ రెంటిని ! 13

చిన్నతన మెంతనిష్కల్మషమైనదో నేను చెప్పఁబోవునదికూడ నంత నిష్కల్మషమైనదే కావున చిన్నతనపుటాట దృష్టాంతముగాఁ జెప్పితిని. నీవు మొదట నాకిచ్చినయప్పు మాబరివానివలెఁ బాడుచేసికొంటిని. పోయినబాణముఁ గనుంగొనుటకై తిరిగి బాణమును వేసినటు లీసారి నాకప్పిచ్చితివేని రెండుబాణములు కనుంగొనినట్లు రెండుఋణములు రు మార్గము లభింపనచ్చును. ఒకవేళ లభింపకపోయినను రెండవసారియిచ్చిన యప్పుతీర్చి మొదటిదానికై యథాప్రకారముగా ఋణపడియుందును.

సత్య—నన్ను నీవెఱింగియు నీయెడ నాకుఁగల ప్రేమనుఁ గూర్చి యిటు గాజె

ప్పి కాలవిలంబన సేయుచుంటివా? నాసర్వస్వము నీకిచ్చెదనో యీయనో యని నీవు పడు సందేహము, నాకున్నదంతయు నవు పాడుచేయునప్పుడైనఁ బొందని విచారము కలిగించుచున్నది. నేను చేయఁదగిన దేదయినఁ గలదని నీకుఁ దోఁచునెడల త్వరితముగాఁ జెప్పుము.

చంద్ర—లయగ్రాహి.—ఇందిరకుఁ బుత్రిక యనందగు ధనాఢ్యు యొక
సుందరి మహేంద్రపురియందుఁ దనరారన్
అందమనుమాట కిదు సందమున యోగ్యగుణ
బృందముల సీతవలెఁ బొందెను యశం బిం
దిందిరములట్లు చెలువొందు కురులందము గ
నిందు నిభ ఫాలతలమందు నటియించున్
సుందరి వచింపకయె మందుఁ గనుసన్నలను
నందనపు వార్తలను సందిగొనియుంటిన్. 14

ఉ. వసుమతిపేర నొప్పెసగు వారిజనేత్రనుఁ బెండ్లియాడ నల్
దెసలను నుండి చాలఁగఁ బ్రతీతినిఁ గాంచిన కాముకోత్తముల్
వెసఁజను దెంచుచుండురల భీమతనూజనుఁ గోరుచున్ దివౌ
కసపతి దిక్పపాలకులు గాటపుఁబ్రీతిని వచ్చినట్లుగన్ 15

తే. గీ. పోటిగ నొకనితో సరిపోవునన్ని
సాధనంబులు నాకున్న సత్యకీర్తి
నళిననేత్ర పాణిగ్రహణంబుఁ జేసి
సందియము లేకనే భాగ్యశాలినౌదు. 16

సత్య—మిత్రమా!

ఉ. ఓడలనుంట నీకుఁ దెలియుంగద నాదగు భాగ్యమంత నీ
వేడినసొమ్ము చేతఁగనుపించదు నాసరుకైన లేదిఁటన్
జేడెను నిన్ మహేంద్రపురిఁ జేర్పఁగ నాపరపత్తిమెంచి యీ
వీడున నెంతసొమ్మైట లభించునొ తెమ్మది నేను తీర్చెదన్. 17

నాచేతనగుసహాయము చేసెద. సొమ్మెక్కడలభించిననుసరే. నాకాసందేహము లేదు నా కొఱకనిగాని నా నమ్మకమునిఁదఁగాని తెచ్చుకొనుము తక్షణమేపోయి కనుంగొనుము.

సత్యకీర్తి—చంద్రమౌళి నిష్క్రమింతురు).

రంగము ౨

## మ హేం ద్రి పు రి.

---

[వసుమతి—చతురిక ప్రవేశించుచున్నారు].

వసు—చతురికా—ఈమహాప్రపంచమునుం జూడంగా నా యీయల్పదేహమున కు విసుగుపుట్టుచున్నది.

చతు—సఖీ ! నీకు సుఖములెన్నియున్నవో యన్ని కష్టములు కలిగినపు డీమాట యనందగినది—ఈలోకములోం గొందఱు సమస్తము కలిఁగియున్నను ఏమియులేక పస్తుపడియుండు బీదలవలె వ్యాధిపీడితులగుచుందురు—కావున ధనవంతు లల్పాయుష్మంతులుగను, మధ్యస్థితిఁగలవారు దీర్ఘాయువులుగను నగుచుండుట తటస్థించుచున్నది—

వసు—మంచిమాట చక్కఁగా జెప్పితివి.

చతు—వానిననుసరించినచో మఱింత చక్కఁగానుండును.

చతు—మంచిమార్గముల ననుసరించుట వానినిఁ గనిపెట్టునంత సులభమగునేని చిన్నగుళ్లపాటికి దివ్యస్థలములుగాను గుడిసెలు రాజభవనములుగాను మాఱియుండును ఒకనికిఁ జెప్పునట్లు తానుగూడ సంచరించువాఁడు దైవసమునుఁడు. మంచినీతులు నిరువదిమందికి వాయాసముగా బోధింపఁగలనుగాని వాని ననుసరించువారిలో నొకతెగానైన నుండ లేను. శిరస్సుపైనుండి బుద్ధులుసెప్పవచ్చును కాని శిరస్సుదారి శిరస్సుది ఇంది యములదారి యింద్రియములది. కుందేటింబోలు యౌవనోన్మాదమున నింద్రియోద్రేకమునకా హితబోధలు—ఈవిచారణలో నాస్వయంవరప్రమేయ మేదియులేదుసుమీ. స్వయంవరమా ? అభాగ్యమునాకా ? ఇష్టపడినవాని వరించుటకును, నిష్టములేనివాని మానుటకును నాకు స్వాతంత్ర్యమేది ? మజ్జనకుని మరణశాసనము బ్రతికియున్న పుత్రికాభిప్రాయమును బంధించుచున్నది ఒకని నొననఁగూడదు. ఒకనికా దనరాదు. ఈస్థితి కష్టముకాదా ? చతురికా.

చతు—నీతండ్రి నిరంతరయోగ్య వర్తనుఁడు పుణ్యాత్ములకుఁ మరణసమయమున మంచియూహలు పొడముచుండును. కావున బంగారు, వెండి, సీసములతో మూడుమందసములఁ జేయించి యొక సంకేత మేర్పఱచియున్నాడు ఆమహాత్ముని యభిమత మెఱింగినవాఁడే నిన్ను వరించును. నీవు నిజముగా బ్రేమించిన యాతనిగాని మఱొక్కనికా సంకేత మెఱుకపడదు. సరేకాని యిదివఱకుఁ నిన్నుఁగోరివచ్చిన రా

జపుత్రవరులలో నెవనిపై నీవలపున్నదో చెప్పుము

వసు—వచ్చినవారిని పేరుపేరువరుసను చెప్పుము. నీవు చెప్పుచుండ నేను వర్ణించుచుందును. నాయభివర్ణనమే నాయనురాగము తెల్పును.

చతు—మొదట నేపాళదేశాధీశ పుత్రుండు.

వసు—ఆపడుచుగుజ్జుపిల్లా ? ఆయనకెల్లప్పుడు తనగుఱ్ఱమునుగూర్చిన ప్రసంగమే. తనగుఱ్ఱమునకుఁ దానే లాడముకట్టగలనని ప్రతిష్ఠగాఁ జెప్పుకొనును.

చతు—పాటలీపుత్రాధిపతియో ?

వసు—వానిముఖము తుమ్మెలలోఁ బ్రొద్దుగ్రుంకినట్లు మటమటలాడుచుండి 'నన్నుఁ బెండ్లాడనియెడల నింకెవనినో" యని చెప్పినట్లుండును. చిత్రకథలన్నియు నిచిఱునవ్వైన నవ్వఁడు. ఇంతయౌవనదశలోనే తగనిచింత పీడింపఁగా నింకఁ బెద్దవాఁడయినపిదప దీర్ఘవిచారములో మునుంగునని తోఁచుచున్నది. వీనిద్వారా మంగళసూత్రము కట్టించుకొనుటకంటె యముని (మృత్యువు) చే మానిసిపురె కట్టించుకొనుట మేలు. వీఁడు నన్ను వరింపకుండ నీశ్వరుఁడు నను రక్షించుగాక.

చతు—పాంచాలాధీశునిఁగూర్చి యేమందువు.

వసు—ఈశ్వరుఁ డాతని నిరుసుగా సృష్టించెనుగాన నట్లేయనుకొననిమ్ము. ఆక్షేపించుట పాపమని నిశ్చయముగా నెఱుంగుదును. ఆతనిగుఱ్ఱము నేపాళాధీశుని గుఱ్ఱమునకంటె మంచిది. పాటలీపుత్రాధిపుని ముఖముకంటె మఱింత మటమటలాడుచుండును. మనుష్యునిగా నెన్నఁబడకపోయినను ప్రతివానికుండు దుర్లక్షణములయు మాత్రి మమూరియున్నవి. పి కయఱచినఁ బిచ్చెత్తియాడును. తననీడపై కొనును. ఈతనిఁ బెండ్లాడిన నిరువ మండిని గట్టుకొన్నట్లు. ఆతఁడు నన్ను వద్దనినఁ బ్రతికిపోదును. నైత్రివలపుచే మోహించినను నేనువరింపను.

చతు—యౌవనవంతుఁడగు శ్వేతద్వీపాధిపతి కేమి చెప్పెదవు ?

వసు—నే నాయనకేమియుఁ జెప్పనని నీవెఱుంగుదువు. ఏమన నామాటలాయనకును, నాతనిమాటలు నాకును దెలియవు. ఆతనికి సంస్కృతము, హిందూస్థాని, తెలుఁగుభాషలురావు. ఒక్కడబ్బెత్తయిన హూణభాష నాకురాదని నీవే ప్రమాణము చేసి చెప్పఁగలవు. అతఁడు సుందరుఁడే కాని విగ్రహములతో నెట్లుమాటలాడ వీలగును ? ఆయనవేష మెంతవికారముగా నున్నది ! తనయంగీ మహారాష్ట్రదేశములోను, కట్టుపంచ మధురలోను, తలపాగ చెన్నపురిలోను కొని యన్నిదేశముల మరియాదలను అలవరించుకొనెను.

చతు—అతఁడు పొరుగువానిఁ గూర్చి యేమనితలంతువు ?

వసు—పొరుగువారికుండవలసిన ధర్మమీతనియందుఁ గలదు. వెనుక శ్వేతద్వీపవాసునిచే నొకతెంపకాయ తిని తనకు శక్తి గలిగినపుడు తీర్చెదననెను. పరాసువాఁడొకఁడు సాహాయ్యముగాఁ (జామీను) రాఁగా వాఁడుకూడ నట్లే దెబ్బతినెను

చతు—సౌరాష్ట్రాధిపతికి మేనల్లుఁడు. ఏమనియెదవు ?

వసు—అతఁ డుదయాస్తులమాత్రమే స్మారకము తెలిసియుండును. అప్పుడే యుషస్సుగా నుండును. మధ్యాహ్నమునఁ దప్పత్రాగియుండును. ఇంక నప్పుడు చెప్పెడిదేమి ? అతఁడు మంచిగా నున్నపుడే మనుష్యుఁ డనిపించుకొనఁదగఁడు అతఁడు చెడుగానున్నపుడు మృగమే మృగమైననుమేలే. గ్రహాచారవశమున నీతన్నిఁ బెండ్లాడవలసినంత ప్రాణగండము వచ్చినను తప్పించుకొందును

చతు—ఈతఁడు సరియైన పెట్టె నేరుకొన్నపుడుకూడ నీ వీతనిఁ బెండ్లియాడినచో నీతండ్రి యాజ్ఞ తప్పినట్లు కాదా ?

వసు—కాఁబట్టే యిట్టివారికి జడిసి తప్పుపెట్టెపై నొకగాజుగిన్నెలో మంచిసార పోసియుంచుమని నిన్ను వేడుచుంటిని. అతఁడు త్రాగుబోతగుటచే నీవు పెట్టిన మచ్చునుబట్టి తప్పు దాని నెంచుకొనును. మద్యపాయిలఁ దప్పించుకొనుటకై యేమయినఁ జేసెదను.

చతు—వీరలలో నెవ్వని వివాహమాడవలసివచ్చునోయని భయంపడకుము. నీ జనకుఁడేర్పఱిచిన పెట్టెలవిధమునఁగాక నీపెండ్లికి మఱియొక పద్ధతి నేర్పఱుపనియెడల వారు తమ త్రోవను తాము పోయెదమనియు, నిన్నుఁ గోరవలంపమనియు నాతోఁ జెప్పిరి.

వసు—నాతండ్రి యభిప్రాయానుసారముగా నాకు వివాహము కానియెడల నేనెంతవృద్ధురాలనై వఱకు జీవించినను కన్యాత్వముననే మరణింతును. ఈకాముక తతికిట్టి వివేకము కలుగుట సంతోషాస్పదమే. వారిదర్శనము నాకు లభింపలేదుగదా యను చింత వారిలో నొక్కనిఁ గూర్చియైన నాకు లేదు. వారందఱు దైవానుగ్రహమున సుఖముగాఁ దమయిండ్లు చేరుదురుగాక !

చతు—ప్రియసఖీ దేవీ ! నీజనకుఁడు జీవించియున్నపుడు కూరటిముఁడును, పండితుఁడును నగు ధర్మపురివాస్తవ్యుఁ డొకఁ డొకరాజుతో వచ్చిన యంశము నీకు జ్ఞాపకమున్నదా ?

వసు—ఔనౌను. ఆయనపేరు చంద్రమౌళి కానోపు.

చతు—సఖీ! అవివేకిని నగు నా దృష్టిపథమునఁబడిన వారిలో నాతఁడే సుందరాంగిని వివాహమాడ దగినవాఁడు.

వసు—ఆయన జ్ఞాపకమున్నారు నీస్తుతి కతఁడు పాత్రమయినట్లుగూడ జ్ఞాపకము కలదు.

(తెరలోధ్వని సేవకుఁడు ప్రవేశించును)

ఏమిరా! ఏమిసమాచారము?

సేవ—దేవీ! నలుగురు మీయొద్ద సెలవుఁ బుచ్చుకొన వేచియున్నారు. మాళవేశుఁడీరాత్రి యిటకువచ్చునని యొక దూత చెప్పినాఁడు.

వసు—ఆనలుగురకు సెలవిచ్చినట్లే యీయెదనవానిఁగూడఁ బంపఁగలిగితినేని నాతనిరాక నాకానందజనకమే. అతఁడు పిశాచాకారము దాల్చినను, తాపసివలె సాధుహృదయము కలిగినవో నన్ను భార్యగాఁ జేసికొనుటకంటె నన్ను మన్నించి విడిచిన బాగుగానుండునని తలంచెదను. చతురికా రమ్ము—సేవకా నీవరుగుము—ఒక కాముకునిఁ బంపి తలుపు సేయఁగ మఱియొకండువచ్చి తలుపుగొట్టుచుండును.

(అందఱు నిష్క్రమింతురు)

---

రంగము 3.

## ధర్మపురి—బజారు.

---

[చార్వాకుఁడు —చంద్రమౌళి ప్రవేశించుచున్నారు.]

చార్వా—మూడువేలమాడలా? మంచిది.

చంద్ర—అవునయ్యా! మూడు నెలలకు.

చార్వా—మూడుమాసములకా—మంచిది.

చంద్ర—నేనిదివఱకుఁ జెప్పినట్లందుకు సత్యకీర్తి పూచీపడును.

చార్వా—సత్యకీర్తి పూచీపడునా? సరే.

చంద్ర—సొమ్మిచ్చి నన్ను సంతోషపెట్టెదవా? ఏమనియెదరు?

చార్వా—మూడు వేలమాడలు—మూడు నెలలపరకు—సత్యకీర్తి పూచీ.

చంద్ర—ఏమి చెప్పెదరు?

చార్వా—సత్యకీర్తి యోగ్యుఁడే.

చంద్ర—అందుకు వ్యతిరేకముగా నేమయిన వింటిరా?

చార్వా—లేదు. లేదు. లేదు. సత్యకీర్తి పూచీపడుటకు దగినవాఁడను నా యభిప్రాయమని మీకుఁ దెలియుట కాతఁడు యోగ్యుఁడని చెప్పితిని—ఇప్పుడాతని ధనమంతయు సంశయాధీనమయి యున్నది. ఒకయోడ త్రిపురమునకును, వేఱొకటి పశ్చిమద్వీపములకును బంపియుండెను—మూడవది వేఱొకచోటికిని నాల్గవది శ్వేతద్వీపమునకుఁ బంపఁబడినదని బాజారులో తెలిసినది. ఇట్లోడలపై నాతని సర్వస్వమును నానాసీమలకుఁ బంపియుండెను. ఓడలు బల్లచక్కలే. నావికులు మనుష్యమాత్రులే. స్థలమూషికములు జలమూషికములుఁగూడఁ గలవు. మెట్టదొంగలు నీటిదొంగలు కలరు. నీటిదొంగలనఁగా నోడదొంగలని నాయభిప్రాయము ఇదిగాక నీటిచేతను, గాలిచేతను, కొండలచేతనుగూడ నుపద్రవములు కలుగవచ్చును. అయినను ఆతఁడు పూచీపడ దగినవాఁడు. మూడువేలమాడలు—ఆతఁడు పత్రము వ్రాయునను కొనెద.

చంద్ర—వ్రాయునని నిశ్చయించుకొనుఁడు.

చార్వా—అలాగుననే నిశ్చయించుకొనెదను. స్థిరపఱచుకొనుటకై తిరిగి యాలోచించుకొనియెదను. నేను సత్యకీర్తితో మాటలాడవచ్చునా?

చంద్ర—మీ రంగీకరించిరేని మాతోకలిసి భోజనము చేయవచ్చును

చార్వా—మాంసపు రుచి తెలియుటకా? మీమతకర్తలు పేర్కొనిన వరాహమూర్తిమాంసము తినుటకా! మీతో బేరమాడెదను—మీకమ్మెదను—మీతో మాటలాడెదను—మీతో తిరిగెదను. ఇట్టివి మఱియయిన జేతును గాని మీతో భుజింపను, మీతో త్రాగను—మీతో ప్రార్థింపను—బజారువార్త లేమిటి—అవచ్చుచున్నవారెవ్వరు?

చంద్ర—ఈయన సత్యకీర్తిగారు!

చార్వా—(తనలో) వీఁడిచ్చకములాడు సుంకరివలె నేలాగు కనుపించుచున్నాఁడో! వీఁడు హిందువుగనుక నాకుఁ గిట్టదు. పైగా వడ్డిలేకుండ సొమ్ము బదులిచ్చి ధర్మపురిలో మావంటివారి బేరము చెడగొట్టుచుండుటచే మఱింత గిట్టదు—

మ. నను నేఁ జేసెడు బేరమందలఁచి నా న్యాయార్జితార్థంబు వ
డ్డని పేర్వెట్టుచు నాపణంబునను బేహారుల్ వినందిట్టు పా
వనమై యొప్పెడు నాకులంబనిన నేవంబొందు వీనిక్ బురా
తనమా నాపగదీఱ మ్రింగెదను చేతన్ జిక్కుటల్ గల్గినన్. 18

వీని విడిచిన మాతెగను శపించినట్లే.

చంద్ర—చార్వాకా వినుచున్నావా ? !

చార్వా—నాయొద్ద నెంతదస్తు నిలువయున్నదో చూచుకొనుచున్నాను. జ్ఞాపకముంచుకొని యిప్పుడింత గొప్పమొత్తము మూడువేలమాడలు సిద్ధముగా లేవని చింతించెదను. ఐననేమి. మాకుస్థునియొద్దఁ జేబఁగులు తెచ్చి పూన్చెదను. అయితే అగం డి ఎన్నినెలలకు మీరు కోరిన షరతు ? (సత్యకీర్తినిఁ జూచి, ఓహో సత్యకీర్తి గారా ? మీకు నూరేండ్లాయుస్సు. నోటిలోమాట నోటిలోనుండఁగానే వచ్చితిరి. (ఇంతవఱకు మిమ్ముఁగూర్చియే మాటలాడుకొనుచుంటిమి),

సత్య—చార్వాకా !

క. వడ్డికి నప్పిచ్చుటయును
వడ్డికి నేఁ దెచ్చు టింతవఱకు నెఱుంగఁ
X దొడ్డచెలికాని తీరని
యడ్డుఁ దీర్పంగవిడుతు శపథంబిపుడున్.

(చంద్రహాళితో) నీకెంతకావలయునో చెప్పితివా ?

చార్వా—అహా ! మూడువేలమాడలు—

సత్య—మూఁడు నెలలకు.

చార్వా—మఱచితిని. మీరు చెప్పినట్లు మూడునూసనులే. సరే పత్రిమ మాట యేమిటి ? వడ్డికి నప్పిచ్చుటగాని తెచ్చుటగాని లేదని మీరు సెలవిచ్చినట్లున్నారు—

సత్య—నేనన్న డట్లు చేయను.

చార్వా—శ్రీకృష్ణుఁడు పశువుల కాపరి యయ్యెను. దేవకీదేవి పన్నిన పన్నాగముచే కృష్ణుఁడు యశోదాపుత్రుఁ డయ్యెను.

సత్య—అతనిఁగూర్చియెందుకు ? అతఁ డేమయిన వడ్డి పుచ్చుకొనెనా ?

చార్వా—లేదు. వ పుచ్చుకొనలేదు. ప్రత్యక్షముగా లేదు మంచిపశువులనెల్ల తాను వశపఱుచుకొనుట మొదలగు నాతడు చేసిన పనులను తలంపుము ఈ లాగుననే యాదవులలో వృద్ధిఁబొందెను. చార్యమూలమునగాక మఱెట్లు భాగ్యవంతుఁడయినను నదృష్టమే.

సత్య—దేవాంశసంభూతుఁడయిన యమ్మహాత్మున కవి యన్నియు చిద్విలాసము

X దొ చెలికాని యక్కఱ
యు పడన్ దప్పదలసె నాచారంబున్. పాఠాంతరము.

లో వడ్డి మంచిదని స్థాపించుట కిది చెప్పితివాయేమి? నీ వెండి బంగారములు పశు ఫలమునా!

చార్వా—అది నేను చెప్పలేను నా సొమ్ము సొమ్మువలెనే భావించి త్యాగాలు చెంకనలంతును కాని అయ్యా నా మాట వినండు—

సత్యా—చంద్రమౌళీ ఇది కనిపెట్టుము—

తే గీ. మంచిదని తనపని సమర్థించుకొనుట
శ్రుతి ప్రమాణంబు దురాత్మునకు దొసగు.
ముఖమునందు విషపుచుక్కు బూనియుండి
పరగుచుండును వాడు దత్తిపండువలెను. 20

దురాత్ముని బాహ్యవేష మెంత చక్కగానుండునో?

చార్వా—మూడువేలమాడలా! గొప్పమొత్తమే. సంవత్సరములో మూడునెల లా? సరే. వడ్డి యేలాగు?

సత్యా—చార్వాకా! మాకు బదులిచ్చి మమ్ము విధేయులంగా జేసెదవా?

చార్వా—అయ్యా! సత్యకీర్తిగారూ!!

తే గీ. మీరు నా సొమ్ము నా వడ్డి పేరుగుచ్చి
పలుమారు నను దూషించిరా పణమునను.
నోర్మితోం దిట్ల కన్నింటికి నోర్చియుంటి
శాంతమే భూషణంబు మా జాతి కగుట.

క. అడిచిపడి నాస్తికుడ! యని
మెడ కొట్టికెడి కుక్కయనుచు మీ రంటిరి తూ
పొడిచితి రంగిపై నా
విడిముడిం దోంచుగతి వాడిపెంచితి ననిగా. 22

ఇపుడు నా సహాయము మీకుం గావలసియున్నట్లు తోంచుచున్నది. ఇపుడు మీరు నాదగ్గఱకు వచ్చి "చార్వాకా! మాకు సొమ్ము కావలయు" నని యడుగుచున్నారు. నా ముఖముపై నుమిసి, యిల్లుదాటిన కుక్కనుం దన్నినట్లు తన్ని యిపుడు సొమ్ము బదులడుగుచుంటిరి మీ కేమి చెప్పవలయును? కుక్కదగ్గం సొమ్ముండునా కుక్క మూడువేలమాడలు బదులీయంగలదా? యని మీ కిపుడు నేను చెప్పంగూడదా? లేక నేను మీ పాదాక్రాంతుండనై మిక్కిలి వినయముతో మెల్లని స్వరముతోను మీ బానిసవలె.

తే. గీ. చిన్న సౌమ్యవారమునఁ మాపాటి దినాఱు
ఒక్కనాఁడు నన్ దన్ని రెండొక్కనాఁడు
శ్వానమంటికి యిట్టి సౌజన్యమునకు
బదులొసంగెదనని చెప్పవలయునయ్య? ౨౩

సత్య—చార్వాకా!

ఉ. అప్పుడెకాదు నిన్ను నిపుడైనను నట్టులె పిల్చి దన్నెదన్
తుప్పన నుమ్మివైచెద బదుల్ దయచేయఁగ నెంచితేని నీ
వప్పుడు వైరకిచ్చుగతి నాప్తునకిచ్చెడు రీతివద్దు సు
మ్మెప్పుడు గొడ్డుసొమ్ము ఋణమిచ్చియు మిత్రుఁడు గోరె వడ్డికిన్. ౨౪

వాయిదా నాటికిఁ దీర్చనివో నిర్దయుఁడవై దండుగ గైకొమ్ము.

చార్వా—అయ్యయ్యో! మీకప్పుడే యెంతకోపము వచ్చినది? మీరు వెనుక నాకుఁ జేసిన పరాభవములన్నియు మఱచిపోయి మీతో స్నేహముఁ జేసికొని మీ యవసరములు కనిపెట్టి మీకు వడ్డిలేకుండ బదులీయఁ దలంచియుండగాఁ నా మాట వినిపించుకొనరు. ఇది నేను చేయఁదలఁచిన సదుపాయము—

చంద్ర—ఇది యనుగ్రహమే.

చార్వా—నేను చూపెడి సదుపాయమేమనఁగా—సత్యకీర్తిగారూ? మీరొక్కరే వినోదార్థ మొక పత్రము వ్రాసి యొక వ్రాతగాని కడకేగి సంతకముచేసి ముద్ర వేసి యుండు. అం దేమియుండవలె ననఁగా—

తే. గీ. వ్రాఱచుకొన్న లెమున ఋణధనములు
గడువునాటికిఁ జెల్లింపఁ బడకయున్న
మీరు కోరుచోటను నా శరీరమందు
మంచి దిత్తు దండుగ శేరు మాంసమనుచు. ౨౫

సత్య—అట్టిపత్రిము వ్రాసి యిచ్చెదనుగానఁ దృప్తిఁబొందుము. బొద్ధునకు వేయయున్నదని చెప్పెదను—

చంద్ర—మిత్రమా! నా యక్కఱ తీరకపోయినను నిమ్ముకాని నాకొఱకై యిట్టి పత్రము వ్రాయకుము.

సత్య—ఎందుక భ్యాభయము. గడువు దాటనీయను. ఈ పత్రము విలువకుం దొమ్మిదిరెట్లు సొమ్ము రెండుమాసములలో నాకు రాఁగలదు. అప్పటికి వాయిదా యింక నొక మాసముండును.

చార్వా—ఆహాబుద్ధగురూ! ఈ హిందువు లెంత సంశయాత్ములు! తాము వ్యవహరించెడు జాడనుబట్టి యితరులను సందేహించుచుందురు. అయ్యా దయచేసి యొకటి చెప్పుఁడు. వాయిదా దాటిన నాకు వచ్చెడిలాభ మేమిటి? ఒక్క శేరు నరమాంసము నా సొమ్మునకుఁజాలునా? పుచ్చుకొందమన్నను మేఁకమాంసమా, గొఱ్ఱె మాంసమా? ఎద్దుదా! నాకేమిలాభము ఆయన దయ సంపాదించుటకై యీస్నేహముఁ జూపించితిని. మీకంగీకారమా సరే? లేకున్నపోనిండు. నన్నింక నెపపెట్టకుఁడు

సత్య—చార్వాకా! సరే. ఈ పత్రము వ్రాసియిచ్చెదను—

చార్వా—అట్లయిన మీరు తక్షణమే వ్రాతగానినిఁ గలిసికొని యీవినోదపత్రముయొక్క పద్ధతి చెప్పుఁడు. నే నొక దుబారిబంటున కిల్లప్పగించి వచ్చితినిగాన దానిని జూచి సొమ్ము సంచిలో వేసి తెచ్చెదను. ఇప్పుడేవచ్చుచున్నాను—

(అని నిష్క్రమించును.)

సత్య—మంచియూధుఁడా! పోయి రమ్ము—ఈతఁడు హిందువు కాఁగలఁడు; ఆతఁడు దయావంతుఁ డగుచున్నాఁడు.

చంద్ర—మాటలు తీపి, లోన విషము నాకిష్టములేదు.

సత్య—రావయ్యా! ఇందులో భయము లేదు, గడువింక నొక నెలయున్నదనఁగా నా యోడలు రాఁగలవు.

(నిష్క్రమింతురు).

ఇది ఆచంట సూర్యనారాయణరాజుచే నాంధ్రీకరింపఁబడిన వసుమతి
(మెర్చెంటు అఫ్ వెనీస్) యను నాటకమందలి
ప్రథమాంకము.



# వ సు మ తి.

# The Merchant of Venice.

---

## ద్వితీయాంకము.

### రంగము ౧—మహేంద్రపురి.

[తూర్యధ్వనులతో మాళవదేశాధీశుఁడు, వసుమతి, చతురిక ప్రవేశించుచున్నారు].

మాళవ—కాంతారత్నమా ?

తే. గీ. సూర్యుఁ డుష్ణప్రదేశ వాసుల కనుగ్ర
హించి పట్టి నీలాంబర మేమొ యనఁగ
నెగడు నా యీకరీరంపు నీల కాంతిఁ
జూచి నన్నిఁ దగింపకు సుందరాంగి.

క. తరుణికి నెచ్చటి మంచును
కరుగదొ యా యుత్తర భువిఁ గల సుందరునిన్
తరుణీ ! రక్తము నీవే
యొఱగాం బోరదము వీరుఁ డెవ్వఁడో తెలియున్.

ప్రియురాలా ? నా యీమేని కాంతినిఁ జూచి పోటుమానిసులే భీతిఁ జెందెదరు. మా దేశమందలి గొప్ప యింటి కన్యకామణులు దీనికాంతికే నన్ను మోహింతురు. నేను నిజము చెప్పుచున్నాను. నమ్ముము ప్రియసతీ ! నీ మనసు హరించుటకుఁగాదేని నే నీవర్ణమును మార్పఁదలంపను.

వసు—రాజా ! కంటి కింపయినంతమాత్రమున వరించుదానను కాను. నాయిష్టానుసారముగా వరునిఁ గోరుటకు నాకు స్వాతంత్ర్యము లేదు. నే నిదివఱకే తమతో మనవి చేసితిని. నా తండ్రి తన బుద్ధివిశేష చే నొక నిర్బంధములో నన్నుంచి యా నిర్బంధము దాటిన వానినే నేను వివాహమాడవలయునని నిర్ణయింపనియెడల ప్రసి పురుషుఁడవగు నీకును నన్ను మోహించి వచ్చిన తక్కిన కాముకులతోఁ బాటు చాసంత యవకాశము కలిగియుండెడిదే.

మాళవ—ఆమాటయైనఁ బలికితివి. దయము గాదా ? పెట్టెలకడకు నన్నుఁ

గొని పొమ్ము. నా యదృష్ట మెట్లున్నదో పరీక్షించి చూచెదను. పాండ్యదేశాధిపతిని, జయించి ఘూర్జరమాళవ సుల్తానుల ముమ్మాఱు గెలిచి యున్న యీచంద్రహాసములో డుగాఁ జెప్పెదను

చ. కొలఁకొల చూచి భీతి నిడు క్రుంకవలె భీతిలఁ జేసి చూడకున్నె
ధరగల క్షాత్రవంశజుల ధైర్యముఁ గూర్తునొ! లాగి తెచ్చినో
వెలువక పాలు ద్రావు పులిపిల్లల నాకట బొబ్బరించు నే
సరి గికరింతునో నిచు ఐరంవను రాలిగఁ జేసి కొంటవు.

అహో కాలగతి! ఎలతి యలంతిచే నోడింపఁ బడనట్టు జీవమున నలుఁడు పుష్కరునిచే నోడింపఁ బడెనుగదా. నేనును దురదృష్టముచేఁ దప్పు పెట్టె నెంచుకొని యయోగ్యునకు మంచి పెట్టె విడిచి విచారముతో గతింతునేమో?

వసు—మీ యదృష్టము నుఁ బట్టి యున్నది. పెట్టె నెంచుటకై ప్రయత్నము యిఁ బొత్తుగా మానుఁడు. లేదా పెట్టె నెంచుటకు ముందుగా తప్పు పెట్టె నెంచినయెడల నింక వివాహముఁ జేసికొన మానుదుమని ప్రమాణము చేయుఁడు. బాగుగా నాలోచించుకొనుఁడు

మాళవ—అట్లు వివాహము చేసికొనను. పెట్టెల కడకుఁ గొనిపొమ్ము.

వసు—అట్లయిన ముందు దేవాలయమునకుఁ దయచేయుఁడు. భోజన మయిన పిదపఁ బెట్టెల నెంచు పని జరుగును.

మాళవ—నలుగురిలో భాగ్యశాలి నగుదునో నిర్భాగ్యుఁడ నగుదునో యదృష్టము బట్టియుండును.

(అందఱు నిష్క్రమింతురు)

---

రంగము ౨

## ధర్మపురి—వీధి.

[గోపాలదాసు ప్రవేశించుచున్నాఁడు]

గోపాల—నిశ్చయముగా నా యంతరాత్మ యీ యయోధ్యుని సేవ విడిచి పొమ్మని బోధించుచున్నది. నన్నుఁ బట్టిన శని నా చెవికడ "దాసూ! గోపాలదాసూ! మంచిగోపాలా! మంచిదాసూ! మంచిగోపాలదాసూ! నీ కాళ్లనుపయోగించుము పాఱిపో" యని చెప్పును. నా యంతరాత్మ "వద్దు వద్దు యోగ్యుఁడను గోపాలా పరికించుమీ యోగ్యుఁడైన దాసూ పరికించుమీ. యోగ్యుఁడయిన గోపాలదాసూ

పాఱిపోదము. పాఱిపోవుట మంచిది కాదని బుద్ధి దెచ్చుకొమ్మ"ని చెప్పును. నన్నుఁ బట్టిన శని మిగుల ధైర్యవంతమయినది. అది "ధైర్యము తెచ్చుకొని పాఱిపొమ్మని చెప్పును. నా యంతరాత్మ కంఠమున వ్రేలాడుచు "మర్యాదవంతుఁడగు మిత్రుఁడా గోపాలదాసూ!" అని పిలుచును. మర్యాదవంతురాలి కుమారుఁడా యనఁదగినది. ఏలననగా నా తండ్రియొద్దఁ గొంచెము మెతక గుణము కలదు. అది యాయనకు నభిరుచి. నా యంతరాత్మ "గోపాలా! పోకుమీ" యని చెప్పును. శని పొమ్మని చెప్పును. వద్దని యంతరాత్మ చెప్పును. అంతరాత్మ చెప్పునంత సేపు నీయోచన బాగుగా నున్నదని చెప్పుదును. శని చెప్పినంతకాల మదియే బాగుగా నున్నదని తోఁచును. అంతరాత్మ చెప్పినట్లు విన నెంచితినేని ప్రత్యక్షరాక్షసుఁడగు బౌద్ధుని సేవఁ జేయవలెను. నన్నావహించిన శని చెప్పినట్లు బౌద్ధుని సేవ విడిచి మరియాద దక్కించుకొని పాఱిపోవలయును. నిజముగా బౌద్ధుఁడు పిశాచావతారమే. నాయంతరాత్మ వద్దని చెప్పినను అది కఠినాంతరాత్మ. నా శనియే మంచి యుపదేశ మిచ్చును ఓ శనీ! నీవు చెప్పినట్లు నేను పాఱిపోయెదను.

[ఒక తట్ట తలపైఁ బెట్టుకొని యొక ముదుసలి కృష్ణదాసు ప్రవేశించుచున్నాఁడు]

కృష్ణ—అబ్బాయిగారూ! దయచేసి బౌద్ధుని యింటికిఁ ద్రోవ చూపెదరా?

గోపా—(తనలో) దైవమా! ఈతఁడు నాకు ప్రియుఁడగు బావమఱఁది. ఈయన యంధుఁడగుటచే నన్నెఱుఁగఁడు. ఈతనిఁ జెవులు పట్టుక యాడించెద.

కృష్ణ- ఆర్యా! బౌద్ధుని యింటికిఁ ద్రోవఁ జూపెదరా?

గోపా—తిన్నగా కుడిచేతివైపు తిరిగి, యావైపె మలుపులో, నెడమకు తిరిగి, యావైపె మలుపులో నేప్రక్కకుఁ దిరుగక వంకరగా బౌద్ధుని యింటికిఁ బొమ్ము.

కృష్ణ—అయ్యో భగవంతుఁడా! ఈత్రోవ తెలియదే. ఆబౌద్ధునికడ నుండెడు గోపాలునిఁ దమ రెఱుఁగుదురేమో చెప్పఁగలరా?

గోపాల—ఆర్యుఁడగు గోపాలదాసుగారిని గుఱించియేనా? (తనలో) నాచమత్కారము చూడు. నిన్నేడిపించెద. (ప్రకాశముగా) కుఱ్ఱవాఁడగు గోపాలదాసుగారిని గుఱించియేనా?

కృష్ణ—ఆతని గారవ నక్కరలేదు. ఒక బీదవాని కొడుకు. ఆతని తండ్రి బీదవాఁడయినను మరియాద గలవాఁడని చె చున్నాను. దేవుని ధర్మమున బాగుగా జీవింపఁ గలవాఁడు.

గోపాల—అతని తండ్రి యెట్టివాఁడైన నేమి. ఇప్పుడు చిన్నవాఁడగు గోపాలదాసుగారిని గురించి మాటలాడుచుంటిమి.

కృష్ణ—ప్రభువుగారి స్నేహితుఁడైన గోపాలదాసు.

గోపా—కాఁబట్టియే గోపాలదాసుగారిని గూర్చియేనా మాటలాడుచున్నారు?

కృష్ణ—తమ కనుగ్రహ మున్నయెడల గోపాలదాసుని గుఱించియే.

గోపా—అందుచేతనే గోపాలదాసుగారు, ఆయన నీకుఁ దలపెట్టకుమని యేమంటిరేని. ఆపడుచు కుఱ్ఱవాఁడు గ్రహచారవశమున, విధివశమున వాని దౌర్భాగ్య దేవతయూాలమునఁ బంచత్వ మొందినాఁడు. అలాగనినచో మీకుఁ దెలియదేమో స్వర్గమున కేగినాఁడు

కృష్ణ—అయ్యో! భగవంతుఁ డంతటి విరుద్ధము చేయకుండుగాక! యీనా వృద్ధాప్యములో నాతఁడే యాధారము ఊతకఱ్ఱ

గోపా—నే నొక చేతికఱ్ఱనలెను, నిట్రాటవలెను, ఊతకఱ్ఱవలె నుంటినా? నన్నెఱుఁగుదురా?

కృష్ణ—ఈదిన మెంత దుర్దినము. అయ్యా తమ్ము నే నెఱుఁగను నాకుఱ్ఱవాఁడు (దేవుఁడు వాని రక్షించుగాక) జీవించియున్నాడో లేదో దయచేసి సెలవియ్యండి.

గోపా—అయ్యా! మీరు నన్నెఱుగరా?

కృష్ణ—గ్రహచారము. నే నంధుఁడను నేను మిమ్మెఱుఁగను.

గోపా—నీకుఁ గన్నులున్నను నన్నుఁ దెలిసికొనక పోవచ్చును స్వంతవానిఁ గనుంగొను వాఁ డెంత వివేకి? నీ కుఱ్ఱవాని వార్త చెప్పెద నన్నను గ్రహింపుము నిజము దాగదు. పుట్టుట దాగినను గిట్టుట దాగదు. హత్య యంతకంటె దాగదు కాని తుదకు నిజము దాగదు.

కృష్ణ.—నాయనా! ఆగండి దయచేసి చెప్పండి. మీరు గోపాలదాసుగారని నానమ్మకము.

గోపా.—ఇంక వేళాకోళము కట్టిపెట్టెదను. నన్ను దీవింపుము. నేనే నీబావమఱఁదిని. త్రికాలములయందును నేను నీ బావమఱఁదినే.

కృష్ణ—నేను నమ్మజాలను.

గోపా.—అలాగయిన నే నేమిచేయుదును. బొద్దుని నేవరుఁడను, నే నే మీబావ

మంచిది. నీభార్య సీత మా అప్పగారు.

కృష్ణం.—అవును దానిపేరు సీత. అలాగయిన నీవే నాబావమఱఁదివేమో. (అని కౌగలించుకొని) నీకెంత గడ్డమున్నదిరా? నాగుఱ్ఱపు తోఁకకంటె పెద్దది.

గోపా.—నీగుఱ్ఱపుతోఁక నముకఁ బెరుగున్నదేమో. నేను వెనుకఁజూచి నప్పుడు నాగడ్డముకంటె పెద్దతోఁక దానికిఁగలదు

కృష్ణ.—నీవెంత చిక్కిపోతివి! నీవు నీయజమానునకు పాఁడిగా నున్నదా? ఆయనకొఁక బహుమతి తెచ్చితిని.

గోపా.—చాలులే. నేనాతని కొలువు చాలించుకొని దేశాలు తెగించి పోవ నిశ్చయించితిని నాయజమానుఁడు నిజముగా బొద్ధుఁడే అతని కా కానుక? ఒక్క యుఁరిత్రాటినిమ్ము వానిసేవలోఁ గరువుకొట్టిపోతిని. నాయెముకలు నీవు లెక్కపెట్ట వచ్చును. బావా! నీవు వచ్చితివని నాకెంతో సంతోషముగానున్నది. నీవు తెచ్చిన కానుక చంద్రమౌళిగారి కిమ్ము ఆయన కొలువుకుదుర నిశ్చయించితిని ఆయన తన నౌకరులకు చక్కని దుస్తులిచ్చుచున్నాడు. ఆయన కొలువు దొరకనియెడల నింక దేశాలు తెగించిపోయెదను ఏమి నాయదృష్టము. ఆయన యీలాగుననే వచ్చుచున్నారు. ఆయనకే-బావా? ఇంక బొద్ధుని సేఁజేసిన బొద్ధుఁడేసరి.

(చంద్రమౌళి సేవకునితోను విజయునితోను ప్రవేశించెను)

చంద్ర.—(సేవకునితో) నీ వాలాగునఁజేయుము. సాయంత్ర మయిదుగంటలకు మించకుండ వంట సిద్ధముచేయింపుము. ఈయుత్తరము లెవ్వరివి వారి కిచ్చివేయుము. బట్టలన్నియు మూటఁగట్టుము. వసంతకుని వేగముగా మాబసలోనికి రమ్మనుము.

(సేవకుఁడు నిష్క్రమించును.

గోపా.—బావా! ఆయనకే.

కృష్ణ.—ఈశ్వరుఁడు మీకు సుఖమనుగ్రహించుఁగాక,

(అని నమస్కరించును.)

చంద్ర.—చిరంజీవ! నాతో నీకేమిపని.

కృష్ణ.—ఈతఁడు నా బావమఱఁది. బీదకుఱ్ఱవాఁడు.

గోపా.— వట్టివాడనుకానండి. భాగ్యవంతుఁడయిన బొద్ధుని సేవకుఁడను సంగతిని నా బావగారు మనవిచేయును.

కృష్ణ.—ఆర్యా! ఈతనికి సేవకవృత్తియం దభిలాష మెండు.

గోపా.—వెయ్యి మాటలేల నేను బౌద్ధుని కొలువు కుదిరియున్నాను నాయభిలాష నాబావగారు చెప్పెదరు.

కృష్ణ—తమతో మనవిచేయఁగూడదు. అయినను క్షమియింపుఁడు. ఈతనికి నీతని యజమానునకు తాత మనుముల వరుస యగుచున్నది. సవతిపోరు

గోపా.—అసోదంతా యెందుకు? నిజ మేమనఁగా బౌద్ధుఁడు నన్ను పీడించుచుండుటచేఁ గష్టముగానున్నది. పెద్దవాఁడు నా బావగారు పైసంగతి తమతో మనవి చేయును.

కృష్ణ.—కొన్ని పాపురము తెలిసవారికిఁ గానకగాఁ దెచ్చినాను. నా కోరిక యేమనఁగా-

గోపా.—అంతెందుకు? అయ్యా! ఆకోరిక నన్నుగఁజెంపరే ఈయన నాకోరిక వెల్లడిచేయును. అతఁ డయిననేమి? నేనయిననేమి? పెద్దవాఁడు బీదవాఁడు అంతయే చెప్పును.

చంద్ర.—ఇద్దఱును మాటలాడక యొక్కరే యదేమో చెప్పుఁడు.

గోపా.—ప్రభువుగారి కొలువు కోరుచున్నాను.

కృష్ణ—సంగతి యంతయు నింతే.

చంద్ర—నేను నిన్నెఱుంగుదును. సరే అలాగే భాగ్యవంతుఁడగు బౌద్ధుని కొలువువిడిచి బీదవాఁడనగు నా సేవ. జేయ సంగీకరింతువేని నీయభిమతమే కానిమ్ము. చార్వాకుఁడు నీవిషయమై నాతో నేడు మాటలాడినాడు.

గోపా.—ప్రాతిసామెత మీరును బౌద్ధుఁడును పంచుకొనిన ట్లున్నారు తమకు దైవానుగ్రహము కలదు అతనికి ధనము కలదు.

చంద్ర—బాగుగాఁజెప్పితివి. నీవును నీబావమఱఁదిని వెంటబెట్టుకొని బౌద్ధుని కడ సెలవుగైకొని నాబసకురమ్ము. (సేవకునితో) ఓరీ! ఈతనికి, నందతివలెఁగాకుండ మంచిదుస్తుకొమ్ము

గోపా—బావా! ఇంకపద! నాకుఁ గొలువుదొరకదా! నాకు నాలుక లేదా మంచిది (అరచేయిచూచి) నాపాటి యదృష్టవంతు డేడీ? ఓఢ్రదేశపు పండితుని వచ్చి గ్రంథముచూచి చెప్పునప్పుడు నా కాయుర్దాయ రేఖ కదుచిన్నది. భార్యారేఖ కూడచిన్నదే నాకుభార్యలు పదునైదుగురా? ఇంతేనా పదునొక్కరు పూర్వాసువాసినులు తొమ్మండుగురు కన్యలు. ఒక్కపురుషున కింతమందేయుండుట బాగుగా నున్నది

కాదు. మూడుజలగండములు. హంసతూలికా తల్పపుటంబుచేత నొకగండము. ఇఁకను చిన్నగండములుగలవు లక్ష్మి యొక్క కాంతయే యైనయెడల, నిన్ని నాకుఁగలిగి యుండు కామెయోగ్యురాలే. బావారమ్ము. కన్నుమూయునంతలో బొద్దుని సెలవుగైకొని వచ్చెదను.

(గోపాలదాసు, కృష్ణదాసు నిష్క్రమింతురు.

చంద్ర —విజయా ! ఇటుచూడుము. ఈసామ్ముతోఁ గావలసిన సామగ్రినికొని త్వరితముగారమ్ము ఈరాత్రి సామిత్రులకు విందు చేయఁదలంచితిని. త్వరగాపొమ్ము.

విజయ.—మంచిది. శక్తి లోపములేక చేసెదను.

(వసంతకుఁడు ప్రవేశించును)

వసంత.—చంద్రమౌళియెక్కడ ?

విజయ.—అదుగో. ఆలాగు వెళ్లుచున్నారు.

(విజయుఁడు నిష్క్ర మించును.

వసంత —చంద్రమౌళీ !

చంద్ర —వసంతకుఁడా ?

వసంత —నాదొక కోరికగలదు.

చంద్ర —అది నెఱవేరినది.

వసంత—నీవు కాదనరాదు నేను నీతో మహేంద్రపురికి వచ్చెదను.

చంద్ర—సరే, మంచిది. కాని యీమాటవినుము. నీవెప్పుడు మోటుగాను పరుషముగాను అడవిమానిసివలె మాటలాడుదువు. నీపద్ధతి కలవాటుపడిన మాకుఁ దప్పు గాఁదోఁచదు కాని నిన్నెఱుంగనివారు వేఱుగఁజూతురు. కావున నీవు వాక్పారుష్యము మాని నమ్రతఁబూని శాంతముగానుండవలెను లేకున్న నిన్నుఁబట్టి నన్నుఁగూడ నట్లే యోచింతురు. ఆపయిని కార్యభంగముకాఁగలదు- (మనము వెళ్లున దత్తవారింటికి)

వసంత—చంద్రమౌళీ, విను నేను నమ్రతవహించి మరియాదగా మాటలాడెదను చీటికిమాటికి లేనిపోని యొట్లుపెట్టుకొనను భగవద్గీతలఁ జేఁబూని భక్తునివలెఁ గనంబడి ప్రార్థించునపుడు టోపీతోఁ గనులుమూసికొని "ఓం తత్సత్" ను పద ముపయోగించుచు మాసలమ్మను సంతోషపెట్టుటకై వేసిన వేషమువలె నాగరికతచూపెదను- ఇట్లు యనియెడల నింకముందెన్నఁడు నన్ను నమ్మకుము,

చంద్ర—సరే, చూచెదముగదా-

వసం—కాని యీరాత్రిమాత్ర మట్లుంచనునుమీ, ఈరాత్రిసేయు నా చర్యను బట్టి నీవేమియు ననరాదు.

చంద్ర—సరే, వినోదముకొఱకే మిత్రులందఱుఁ జేరుచున్నారు గనుక నీసంతోషము కనుఁబఱుప నవ్వుచు త్రుళ్లుచు నుండుము. మంచిది, నాకుఁ గొంచెముపని యున్నది.

వసంత—నేఁడు ప్రభాకరుఁడు మొదలగు వారికడకుఁ బోవలెను-రాత్రిభోజన సమయమున దర్శనము.

(నిష్క్రమింతురు.)

---

## రంగము 3.

### చార్వాకుని యిల్లు.

[పద్మినియు-గోపాలదాసు ప్రవేశింతురు]

పద్మిని—ఓయీ! నీవు మాతండ్రిగారి కొలువు చాలించుకొనినందుకెంతో విచారముగా నున్నది మాయిల్లొక నరకకూపమువలె నున్నను, అట్టితోఁపనీయక యేదో వినోదముచేసి సంతోష పెట్టుచుండెడివాఁడవు మంచిది గోపాలదాసూ! నీకు సుఖమగుగాక! ఈమాడఁగైకొమ్ము; నీక్రొత్తయజమాని యాధితిగా నేటిరాత్రి భోజనమున ప్రభాకరుఁడుగారు వత్తురు. ఆయన కీయుత్తరము రహస్యముగానిమ్ము నేను నీతో మాటలాడుట మాతండ్రి వినగోరను-

గోపా—అయ్యో! నేను చెప్పఁదలఁచినదాని నాకన్నీరే వెల్లడిచేయును. సుందరాంగీ! పద్మినీ! సెలవు తీసుకొనియెద. ఆఁడుదానివలె నాకుఁ గన్నీరు వచ్చుచున్నది.

పద్మిని—గోపాలదాసూ? పోయిరమ్ము, అది యేమిపాపమోగాని నాతండ్రి కూఁతురనని చెప్పుకొనుటకు సిగ్గగుచున్నది. నే నాతని కుమార్తె నౌదునుగాక, ఆతని గుణములు చేష్టలు నాకుఁగిట్టవు ఓప్రభాకరా! నీబాసలు కార్యములుగాఁ బరిణమించినచో నాకీబాధవదలి నేను హిందువునై నీప్రియభార్య నయ్యెదను.

(నిష్క్రమింతురు.)

---

రంగము ౪.

ధర్మపురి వీధి

[వ ంతుడు, ప్రభాకరుడు, హరదత్తుడు, చారుదత్తుడు ప్రవేశించుచున్నారు]

ప్రభా—భోజనసమయమందు మనము సన్న గాజారి మాబసలో మాఱువేషములు వేసికొని యొక్కగంటలోఁ దిరిగిన త్తము.

వసం—మంచిసన్నాహము చేయులేదు.

హర—ఇప్పటి కింకను కాగడాపట్టువారినిఁ గుదర్చలేదు.

చారు—సన్నాహాలోపముండిన బాగుగానుండదు, సన్నాహమేమియు - గు కావున మనము మాఱువేసములు వేయ క మానుట యుత్తమము.

ప్రభా—ఇప్పుడు నాలుగు గంటలయినది, ఇంకను రెండుగంటల వ్యవధి యున్నది.

(గోపాలదాసు ఉత్తరముతోఁ బ్రవేశించును)

గోపాలదాసా! వార్తలేమి ?

గో — మరియుత్తరముఁ జిత్తగించిన వార్తలు తెలియఁ లవు.

ప్రభా— ఉత్తరముపుచు కొ ) ఈ వా నేనెఱుగుదును, చక్కనిదస్తూరీ! ఈ కా ముకం టును ఇది వ్రాసి హస్తము మఱింతయుం నుండును;

సంత— వ... వార్తలాయేమి ?

గోపా—చిత్తము! సెలవుతీసుకొనియెద.

ప్రభా—ఎక్కడ కేగెదవు ?

గోపా—నాప్రాతయజమానుఁడగుబౌద్ధునిఁ గ్రొత్తయజమానునిగారింట దు కాహ్వానము సేయవలెను.

ప్రభా—ఇది బహుమతిగా గైకొమ్ము. తానువ్రా న ... త- న హాస్యముగాఁ బ... ఁ జెప్ప... పొమ్ము.

గోపా—చిత్తము.

నిష్క్రమించును

ప్రభా—అరు లారా కాగడావాఁడు ఈ ి నా డు ను హో ందుగను సిద్ధముగానుందురా

హార—అందుకొఱకే యిప్పుడే వెళ్లెదను.

చారు—నేనును అట్లే చేసెదను.

ప్రభా—సరే, ఒకగంట పోయినతరువాత వసంతుని బసలో నన్నుఁ గలిసి కొండు.

చారు—ఆలాగే.

(హారదత్త చారుదత్తులు నిష్క్రమింతురు.)

వసం—ఆయుత్తరము పద్మిని వ్రాసినదికాదా ?

ప్రభా—అంతయును నీకు జెప్పెదను.

చ. జనకుని యింటనుండి తనుఁజయ్యన నేఁగొని పోవుపద్ధతిన్
దనచెయి జిక్కినట్టి నగ నాణెములన్ దనమూట వేసపుం
బనికను వైనభృత్యజన స్త్రీగణముల గ్రహించి యేఁగుటల్
వనిత లిఖించెనమ్మి ప్రియ [illegible] ద యీ తద్ఘంబునన్.

సాధువర్తనయైన యామాఁటనునట్టియే బొద్ధున చెప్పినయున యీసాక్షి నుకంగవలెను పతితుఁ గు బొద్ధుని కుమార్తెకైనను నేమోకాని లేకున్న నామెకెప్పుడును దురదృష్టము పట్టనేరదు, రమ్ము. నవ్వుచుచు నుత్తరము చూతువుకాని. పద్మినియే నాకాగ డావాఁడునుమా ?

(నిష్క్రమింతురు.)

---

రంగము ౫.

చార్వాకుని యిల్లు.

[చార్వాకుఁడు-గోపాలదాసుఁ బ్రవేశింతురు.]

చార్వా—వృద్ధుఁడనగు నాకును చంద్రమౌళికిని గలభేదము నీవేకనిపెట్టగలవు. (తలుపుతట్టుచు అమ్మాయీ పద్మనీ! (గోపాలదాసుతో) నాయింటికడదిని నట్లంత మెక్కి తినరాదు. (తలుపుతట్టి) అమ్మాయీ ? పద్మినీ ! (గోపాలదాసుతో) గుఱ్ఱుపెట్టి నిద్రించుచు బట్టలఁ జించుకొనరాదు. (తలుపుతట్టి) అమ్మాయీ ? పద్మినీ ! నేను పిలుచుచుంటి.

గోపా—అమ్మా పద్మినీ! (అని పిలుచును)

చార్వా—ఏల అరచెదవు ? నిన్ను పిలువమనలేదే.

గోపా—॥నీవెప్పుడు చెప్పించుకొననిది యేపని చేయ వా॥కదా తవ రొకస సెలవిచ్చిరి. అందుచేత నిప్పుడు తమరు చెప్పకుండ నే పిలిచితిని.

(ప ద్మిని ప్రవేశించును)

ప ద్మి—పిలిచినారా ? యెందుకు ?

చార్వా—అమ్మాయీ ! పద్మినీ । న రాత్రి ఏందుకకుఁ బిలిచినారు అఁగో తాళము చెవులు. వారు నన్ను క్షేమచేఁ బిలువలేదు. న న్నబ్బ వేయుదురు: నేను పగచేత నేబోయి యీ దూబతి హిందువునకు వ్యయమెక్కువచే నెదను. అమ్మాపద్మిని ఇల్లుపదిలము. నాకక్కడికి వెళ్లుటయే యిష్టములేదు.

క. ఎంచఁగ సాధనము౦చిన
సంచుల గతరాత్రి నేను స్వప్నములో న్
గాం త౯ గావు నేదో
వం రాగ దటంచు వ్యసనముకలిగెన్.

గోపా—అయా ద చేయుఁడు. నాయజమానుఁడుగారుతమరాకకు నిరీక్షించి యుందురు. త దిట్లు.

చారా —తగదిట్లు-నిజముగాఁ దిట్లు తిట్టును.

గోపా—వా రందఱొకచోఁజేరి యేదో పన్నుచున్నారు. వారు మారువేసములు వేసికొందురని నేనుచెప్పను. మీకుఁ గనుప నయెడల నాలుగేం క్రిందట త్రా ణ మంగళవారము కార్తీక సోమవారమునాఁడు వచ్చినపుడు సాయం మాఱు గం లవేళ నామువ్కనుండి నెత్తురుకాతినది. అందుచేతనైయుండును.

చారా —ఏమీ మాఱువేసములా ? హోలీపండుగా యేమి ? పద్మినీ : విను చున్నావుగదా.

చ. తలుపుల మూయవమ్మ మతి తప్పెట తాళము చప్పుడైనచో
వడివడి నెక్కకమ్మ తలవాకిటపై కిటికీలపెకి వీ
థులఁబడి వెఱ్ఱివేసములతోఁజను హిందులఁ దొంగిచూడ క
యు లువులు నాగృహంబు సోఁకు ండఁగ మూ ము జా కంబులన్.

ఈదినంబున ందునకేగ బొత్తుగా వ లేము లైను. -ముందు డువును వచ్చుచు టినని చెప్పును;

గోపా—నేను ముందుగద చెదను-(పద్మిఁతో) ఈతఁడెంత చెప్పిన చెప్పఁగాక. కిటికీలోనుండి చూచుచుందుము.

సుందరాంగి చూచిమెచ్చ
హిందువిప్పుఁడిట్లువచ్చు

(అని నిష్క్రమించును.)

చార్వా—ఆబానిసకొడు కేమి చెప్పుచున్నాఁడు ?

పద్మి—అమ్మా పోయివచ్చెద నన్నాఁడు-మఱేమియు లేదు.

చార్వా—వీఁడు మంచివాఁడేకాని తిండిపోతు. సత్తువలో నెమ్మదిగాఁ బని సేయును. అడవిపిల్లికంటె నెక్కువగాఁ బగలునిద్రించును. ఇట్టిసోమరులు నాయింట నుండ లేరఁగనుక విడిచితిని. బదులు తెచ్చుకొనినసొమ్ము పాడుచేయుటలో సాహాయ పడుటకై వీనినప్పగించితిని. పద్మినీ ! లోపలికిఁబొమ్ము. నేను త్వరగానే వచ్చెదను. నేనుచెప్పినట్లు తలుపులువేసికొమ్ము బాగుగా బంధింపఁబడినది చక్కగా సాధింపఁబడు నను సామెత పొదుపుగలవారు మఱతురా ?

(నిష్క్రమించును.)

పద్మి—మంచిది, ఇంక నాయాస వదలుకొనుము. నాయదృష్టము పండినయెడల లింక నాకదండ్రివిగావు నేనకూఁతురనుగాను.

(నిష్క్రమించును.)

---

రంగము ౨.

(మాఱువేసములతో వసంతకుఁడు హరదత్తుఁడు ప్రవేశించుచున్నారు)

వసంత—ప్రభాకరుఁడు మనల నీయింటిదగ్గఱనే నిలువుమని కోరెను.

హర—ఆతఁ డాలస్యము చేసినాఁడు.

వసంత—కాముకులు నిర్ణీతసమయమునకు ముందే సాధారణముగాఁ గనిపెట్టి యుందురు- ఈతఁ డాలస్యముచేయుట యద్భుతమే.

హర—కాముకులు తమకార్యము భంగముకాకుండుటకై మన్మథుని చిలుక రథముకంటె పదిరె వేగముతోవచ్చి పరస్పరము కలియుటకు నెంతో యాతురతతో నుందురు- కార్యమయినపిదప నట్లుండరు.

వసంత—నిజమే.

క: విను మీభోజనము నకును
మును పాకలి యుండుఁగాని పూర్ణముగా భో
జనమైన పిదప నైతము
జనునకు నెట్లుండఁగలదు చక్కఁగఁ జెపుమా.

ఎన్నియో చిత్రనటకలు నేర్చినట్టియు వానినన్నిటిని జూపి క్రమ్మఱ దొంటి జవ సత్వములతోఁ జూపఁగలదా ?

ఉ. ఆరసు దూబఱో వలెనె యౌవనవంతుల పోల్కి యోడలున్
తోఁపు భూషణంబులనితోఁ జెడు చాపలతోడ మోహపుం
వారిధి వ చలాత్మయగు వార వధూటినిఁ బోలుగాలి యా
ధారముగా బయల్వెడలి దారిని దుర్వ్యయమున్ దుపాను పెన్
బానిఁజిక్కి రూపుచెడి బల్ శిథిలాకృతితో రేవులన్
జేరెడుగాని తొంటి యుఁలనీటును గోటును నిల్వ నేర్చునే:

(ప్రభాకరుఁడు ప్రవేశించును)

హర—ప్రభాకరుఁడడుగో. ఈయంశము గూర్చి తరువాత మాటలాడుదము.

ప్రభా—ప్రియమిత్రులారా! నాకై చాలసేపు కనిపెట్టుకొనియున్నారు.

తే గీ నన్నుఁ గూ  రీక్షించి యున్న మిమ్ము
వాపిన పనిగా నే నా లేదు
సతులకై మీరు దొం  వ ములు వేయు
నపుడు మీ కొఱకిక్లై  నాగియుందు.

దిరయే నా మామ రి బాగుని యిల్లు. ఎవ్వరు లోపల ?

[కృష్ణవాని వముతో పద్మిని మేడపై నున్నట్లు ప్రవేశించును.

ప —నాటధ్వని పట్టి పో తని శాని మరింత నిశ్చయముగా తెలియఁగోరెద. ఎవ్వరు మి-ఱు ?

ప్రభా—నీ ప్రియుఁడగు ప్రభాకరుఁడు.

పద్మి—నిజముగా నా మనోహరుఁ యిన ప్రభాకరుఁడేనా ? నే నెవ్వ నింతకంటెఁ ప్రేమింతును ? నేను న గుడునో కానో వు తప్పమ యె ఱుంగుదురు ?

ప్రభా—నీవు నాదాన వగుట మన నెఱుఁగును దేవుఁ డెఱుంగును.

పద్మి—ఇదిగో ఈపెట్టె నందికొనుము మనశ్రమమునఁ దగిన ఫల మిచ్చును, రాత్రి యగుటచే నాకు సంతోషముగా నున్నది నన్నెవరు పట్టలేవు. నాపూలు చేసము నాకే సిగ్గు. కామమంం ధత్వ మిచ్చును. కావున కాముకులు తమ తప్పు లెఱుంగరు, అ హెల్లెదెర్రగిరేని మన్మధుఁడే నావేసముఁ జూచి సిగ్గుపొందెడును.

ప్రభా—దిగిరమ్ము నీవే నాకు దారి చూపవలెను కాగడా పట్టుము

పద్మి—నా సిగ్గునకుఁ దోడు దీపముకూడ పట్టవలయునా? నాసిగ్గే నన్ను నిజముగా బయలు పుచ్చుచున్నది దానికిఁ దోడు దీపము పట్టుట భేరికి జోకొట్టుటవంటిది. నేను దాగి యుండవలెను

ప్రభా—ప్రియురాలా! నీవే దాగియున్నావు నీ యందమగు బాలకుని వేషముతోనే రమ్ము. చాల రాత్రియైనది చంద్రమౌళి విందునకుఁగని పెట్టుకొని యుండును

పద్మి—నుటికొంత ధనముఁ బుచ్చుకొని తలుపులు బిగించి యిప్పుడే వత్తును.

(మేడపై నిష్క్రమించును)

వసం—ఆమె బా కన్య కాదని నా నమ్మకము.

ప్రభా—ఆమెను హృదయపూర్వకముగా ప్రేమింపనియెడల నన్నుఁ బాపము చుట్టుకొనును.

చ, తెలివిఁ బ్రగల్భురాలుగద తెల్వి మెఱుఁగ బరికించి చూడఁగన్
లలన మనోహరాంగి గద నాకనులున్ భ్రమియింపవేని ని
ష్కలుషపు ప్రేమఁ జూపినది కావున లిఖ్యనీయురాలె గా
నిలిపెద నట్టివాఁడనయి నిత్యము నామది నామె రూపమున్.

[పద్మిని ప్రవేశించుచున్నది].

ఏమీ! వచ్చితివా? ఆర్యులారా! పదండి. మనకై మిత్రులంపలు వేచియుందురు

(ప్రభాకరుఁడు, పద్మిని. హరదత్తులు నిష్క్రమింతురు).

[సత్యకీర్తి ప్రవేశించును .

సత —ఎవ్వరక్కడ ?

త—సత్యకీర్తి గాదా ?

సత్య—చీ. చీ. వపంతకుఁడా! తక్కినవార లేరీ. తొమ్మిది గంటలయినవి, మిత్రులంపలు పెట్టుకొనియున్నారు. ఈరాత్రి పండుగ లేదు, గాలి యనుకూల

ముగా నున్నది గనుక చంద్రవళాళి యిప్పుడే బయలుదేఱును. మీనిమిత్త మిరువది మందిని పంపితిని.

వసంత—పంపుగ లేకపోయిన పోనిమ్ము. ఈరాత్రి బయలుదేఱుటయే నాకు పరమసంతోషము.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

రంగము ౭.

మహేంద్రపురి—వసుమతీ గృహము.

[తూర్యధ్వనులతో మాళవదేశాధీశుడు, విజయవర్మ పరివారము, వసుమతి ప్రవేశించుచున్నారు.

వసు—పెట్టెలను కప్పిన పుట్టము తీసి యాపెట్టెల రాజకుమారునకు జూపుచు తెను రిప్పుడెంచుకొనుడు.

విజయ—(చూచి) మొదటిది బంగారపుది. దీనిపై నిట్లు వ్రాయబడియున్నది.

సురలతావృత్తము- నను మదిఁ గోరఁగ మనుజు లనేకుల్
మనములలోఁ గోరునది లభించున్.

రెండవది వెండిది, దీనిపై నేమో వాగ్దత్త మున్న!

చంద్రవదనావృత్తము –దీనిఁ బడయుంగఁ దాను తగి యుండున్
దాని నను గోరఁగ మానవుఁడు పొందుఁ.

మూడవ ది సీసపు పెట్టె. మోటుతనముఁ జూపుచు నేమో చెప్పుచున్నది.

వసుధావృత్త—ననుఁ గోరినచోఁ దన కుండెడు దా
నిని దాచక తెంపున నీయవలెన్.

కాలతామునీ. నే నెంచున స యై యెట్లు తె యును?

వసు—రాజకుమారా! ఇం దొక ం నిలో నావి హమున్నది. దా నెంచిన నేను నీదానను.

విజయ—ఈశ్వరుఁడు నాయోగ నకుఁ దోడ్పడును గాక! ఈపైవ్రా లఁదిఁగి చూచెదను. సపు పెట్టెపై నేమియు న్నది

వసుధావృత్తము— ను గో చోఁ దన కుండెడు దా
దాఁచ తెంపు యవలెన్.

ఇచ్చివేయవలెనా ? ఎందుకు ? సీసమునకా ? దీనికి సాహసించి యిచ్చివేయ వలెనా ? ఈపేటిక బెదరించుచున్నది.

తే. గీ. మంచిలాభంబుఁ బొందంగ నెంచికొనుచు
నున్నదంతయుఁ దెగువతోఁ నొసఁగుచుండ్రు
పనికిమాలిన పయిపయి వన్నెలకును
పరువు లెత్తునె ? బంగారువంటి మనసు ?

కావున సీసమునకై సాహసించి నాకున్నదంతయు సమర్పించుకొనను. నిర్మలకాంతితో మెఱయు రజితపేటిక యేమి చెప్పుచున్నది ?

చంద్రవదనావృత్తము—దేనిఁ బడయంగన్ దాను తగియుండుక
దా ననుగోరన్ మానవుఁడు పొందున్.

తన పాత్రతకుఁ దగినదా ? మాళవాధిపా ? యించుక యోచింపుము. నిష్పాక్షికముగా నీయోగ్యత విచారించుకొనుము.

ఉ. క్రిన్నన పక్షిపాతమునఁ గాక త్వదర్హత నెంచుకొమ్ము నీ
యెన్నికఁ జూచుకొన్నయెడ నెంతయునైనను జాలుఁగాని యీ
యన్నుల మిన్నను దగిన యర్హత కల్గక పోవునేమొ యి
ట్లెన్నుచు సంశయించు టది హీనముగా నను జేసె యెంచుబో.

నాకేది తగునో దానినే కదా బడయుదును ఆ కాంతామణియే నాకుఁ దగును.

తే. గీ. ఘన కులీనతచేత భాగంబుచేత
శిష్టగుణసంపదలచేత శి[illegible] చేత
వి యన్నింటి మించెడు ప్రేమచేత
నువిద మిన్నకు నే నె యర్హుండ నగుదుం.

ఈపెట్టెను గోరకుండ నింకఁ బైకేల పోవలయు ? అయినను సువర్ణపేటిక యింతకంటె నేమి చెప్పునో చూచెదను.

సురలతావృత్తము- నను మది గోరన్ మనుజు లనేకుల్
మనము లలోఁ గోరునది లభించుక.

కాంతామణినే లోకులందఱు గోఱుదురు.

సీ. ధారు[illegible] లి నవతారమొందిన దేవతాకన్య యనఁనొప్పు తరుణి నెలమి
ముద్దాడ గోరుచు మూగుచుండిరి నృపకాముకుల్ పుడమి నల్దెసలనుండి

కనులపండువుగాఁగఁ గాంతామణినిఁ గాంచఁ బ్రఖ్యాతివడసిన రాజపుత్ర
వరుల రాకల ఘోరవము లెడారఁగలు రమణీయ రాజమార్గంబు లయ్యె
స్వర్ణశుఖంబున నుమియంగఁ జదల నొరయు
నూర్మి కాళీకరము లొప్పునుదధి యడ్డు
గామి దాని కాలువవలెఁ గడచు చుండి
కాంతకై వత్తురు విదేశ కాముకులును.

ఈమె దివ్యపట మీ మూటిలో దేనిలోనో గలదు. అది సీసపుపెట్టెలో నుం డునా ? అట్లు తలఁచుట చాల నీచపు టూహ. ఈమె కట్టి విడిచిన బట్టలయిన నందుంచఁ దగదు. మేలిమిబంగారుకంటెఁ బసిరెట్లు విలువతగ్గిన వెండిపెట్టెలో నామె పట ముండునా ? శుద్ధ పాపపు తలంపు. అట్టిదివ్యసుందరీ రత్నము బంగారమునకుఁ దన దానిలో నుంచఁబడదు పూర్వము శ్వేతద్వీపమందు నాణెములందు దేవతాకనా రూపము బంగారుపైఁ జెక్కంబడినది. ఈదేవతాకాంత విగ్రహముకూడ బంగారు నుండకపోదు దీని తాళ మిమ్ము. దీని నెంచితిని. నా యదృష్టమెట్లున్నదో.

వసు—రాజకుమారా! అదిగో తాళము చెవి. నాపట ముందుండినను నే నీదాననే

(విజయవర్మ బంగారుపెట్టె తెరచును)

విజయ—అయో ! దైవమా ! ఇందేమి యున్నది. పీనుగు తలయున్నది. అందు కూన నేత్రావయుజమం దేమో వ్రాయంబడి యున్నది. అది యేమో చదివెదను?

సీ ఎన్నిసారులు నీవు విన్నావు మెఱయుచుండిన దెల్ల పసిడికాదనుచుఁ జెప్ప
పలువురు తమ జీవములె యమ్మియున్నారు నారూపు చూచి యానంద మొంద
పసిడి పూతలచేత భాసిల్లుచుండు గోపురములఁ దఱుచుగా యిరువులుండు
నీ ధైర్య మున్నంత బా యుండిన వయువంబు నిండు యౌవనంబు
యోచనము చాల క్షమె యొనర నేని
నొందకుందు విటువంటి యుత్తరంబు
నీవు తలఁచిన పని యెల్ల నీ గా
వేగ నీ పురి కింక నీ వేగ యు

నిజముగా నీక్లుకాటినది శ్రమవ్య మైనది. తాపమా ! ఇం ఁ మ్ము. శైశ మా రమ్ము. వసుమతీ! సెలవు. వ్యసనక ముగు సెలవు గైకొనుటకు ము సెం విచారముగా నున్నది. ఓడిపోయినవా రిల్లె వెడలెదరు. (అని నిష్క్ర మి చును)

లాడుచుంచఁగా మనదేశపు టోడ యొకటి మిక్కిలి విలువగల సరకుతో శ్వేతద్వీప మునకును తమ దేశమునకు నడుమనున్న సముద్రపు పాయలోఁబోయినదని చెప్పినాడు. అతఁడా సంగతి చెప్పఁగానే సత్యకీర్తి దేమో యని తోఁచినది ఆతనిది కాకుండుఁ గాక యని రహస్యముగా నీశ్వరుని వేడితిని.

చారు—నీవు వినిన యంశము సత్యకీర్తితోఁ జెప్పుట యుత్తమము. కాని హఠాత్తుగాఁ జెప్పకుము గుండె పగులునేమో!

మ—ఆతనికంటె దయాళువింక నీలోకములోఁ బుట్టంబోఁడు. చంద్రమౌళి త్యకీర్తి యి ద్దొరుల విధుమనప్పుడు చూచితిని చంద్రమౌళి తాను సాధ్యమగునంత వేగముగా చ్చెదనని చెప్పఁగానే త్యకీర్తి "అట్లు సేయకుము- నాకొఱకై నీకా రము చేఁగొట్టు కొనకుము చంద్రమౌళీ! కార్యము జయించువఱకు నిశ్చలచిత్తము తోఁ బనిసేయుము. మోహావేశమగు నీ మనసులో నేను బొద్దుని వా సియిచ్చిన పత్రపు సం తి నీ తలఁపునఁ బాఱనీయకుము. ఎల్లప్పుడు ంతోషముగా నుండుము కామ ంత్రములో నామెను మచ్చిక జేసికొనుటకై నీబు ని బాగుగా వి యోగ పఱుపుము" అని చెప్పెను.

చ. కనులను బాష్పబిందువులు గ్రమ్మఁగ మిత్రునిఁ జూడలే మో
మునుఁ బె కుక మ ల్చుకొ పొంగెడి దుఃఖము నా కొంచుఁ బే
ర్తినిఁ జెయి వెన్క కున్ బఱ మి ని జేతిని జేయి వేసి పం
పెను తన మిత్రునిన్ మిగుల వింత ం గొప్పవిచార మొందుచున్.

చారు—సత కీ యాతని నిమిత్తమే యీప్రపంచమునుఁ బ్రేమించినట్లు తోఁ చెడిని. మ మిం డతివేగముగాఁ బోయి యాతని వ సునంద విచా మును మన వేడుక మాటలచేత బోఁగొట్టుదము రమ్ము.

మర—అలాగుననే చేయుదము

---

రంగము ౯.

మహేంద్రపురి—వసుమతీ గ హము.

[పరిచారికతో చతురిక ప్రవే ంచును.

చతు—తో పడు త్వర డు. నిన్ను వేడెద త్వరితముగా దె యుము కాశ్మీరదేశాధిప ప్రమాణము ని పెట్టె నెంచ దయచే చున్నాను.

(తెరలో తూర్యధ్వనులు).

[కాశ్మీరాధిపతి, వసుమతి, అనుచరులు ప్రవేశింతురు]

వసు—రాజకుమారా! అదిగో పెట్టెలఁ జిత్తగింపుఁడు నా పటమున్న దాని సమును దమరెంచితేని మనవివాహమహోత్సవము జరుగఁగలదు తనదుతప్పినయెడల మహారాజా! మాఱుపలుకక యిక్కడనుండి వెంటనే వెళ్లిపోవలసినదగును.

కాశ్మీ—కాంతామణీ! మూడు విధులననుసరింపఁ బ్రమాణము చేసితిని.

ఉ. ఎంచిన పెట్టెయేదో మతి యొక్కరికెప్పుడు చెప్పకుండటన్
ఎంచఁగ రాని దెంచిన మఱెప్పుడు నేను వివాహ మాడ య
త్నించుట మానివేయుట కదృష్ట విహీనతఁ దప్పపెట్టె నే
నెంచిన వెంటనే పురికి నేగఁ బ్రమాణము చేసివచ్చితిన్.

వసు—వ్యర్థరాలనగు నాకొఱకై యిట్టి దారుణప్రమాణములఁ జేసి వచ్చుచున్నారు.

కాశ్మీ—నేను సిద్ధముగానున్నాను భాగ్యదేవత నామనోరథం బీడేర్చుఁగాక. స్వర్ణపేటిక, రజితమందసము, సీసమగు సప్పపెట్టెయునా?

వసుధావృత్తము. నను గోరినచోఁ, దనకుండెడు దా
నిని దాఁచక తెం, పున నీయవలెన్.

సాహసించి యిచ్చివేయుటకు నీ వింతకఁబెట్టు వంచి రూపముతోనున్న బాగుగానుండును. బంగారుపెట్టె యేమిచెప్పుచున్నది? చూడనిమ్ము

సురలతావృత్తము. ననుమదిఁగోరన్, మనుజులనేకుల్
మనములలోఁ గో, రునది లభించున్.

అనేకులు గోరునదా? ఆ యనేకులనఁగా!

ఉ. గాలికి నెండవానలకు గల్గు నుపద్రవ మూహనేయఁగాఁ
జాలక బైట గోడపయి చప్పున గూడును కట్టు పిచ్చుకం
బోలెను గంటికింపౌ గు పూతమెఱుంగులఁ జూచి భ్రాంతులై
బేలతనంబుచూపు నవివేకి జనంబులె యేమొచూడఁగన్.

అట్టి —మూర్ఖులతో-సముఁడనై సాధారణులవలె పామరుఁడనై యనేకను కోరరానిని నేనుకోరను. ఇంక రజితమందసమా? నీపై నేమివ్రాయఁబడి యున్నదో యొక్కసారి చూడనిమ్ము.

చంద్రవదనావృత్తము దేనిఁబడయఁగన్, తానదగియుండున్
దానినను గోరన్; మానవుఁడు పొందున్.

మిక్కిలి చక్కఁగాఁ జెప్పఁబడినది.

క. తన యర్హత లేకి రీ
తిని నరమాత్రుండు భాగ్యదేవతను మహిన్
గనుగప్పి లేనిభాగ్యము
ఘనతను దెచ్చుక చరింపఁ గలుగను చెప్పుమా.

లేని యర్హత నెవ్వఁడును తెచ్చుకొనఁ గుండుఁగాక. ఆహా! కిరుసులు సత్పదవుల్కా, ఉద్యోగములు మొదలగు వాసియందు మోసమే లేకుండిన నెంతయోగ్యముగా నుండును? నిజమయిన యర్హునికే మరియాదయున్న నెంతో యుక్తముగా నుండును. అట్లయిన శిరోవేష్టనము లేని వారెందఱు దానిధరింతురు? అధికారము సాగించు వారెందఱు సాగింపఁబడుదురు? ఇప్పుడు ఘనులమని తిరుగువారిలో నెందఱు హీనులుగా నుండరు? కాలవశముచే నిపుడు బొత్తుగా గౌరవములేక యొదిగి యుండు వారెందఱు మాననీయులగుదురు? మఱిది నే దీని నెంచుకొనియెద

చంద్రవదనావృత్తము. దేఁబడయఁగన్, తానదగియుండున్
దానినను గోరన్, మానవుఁడు పొందున్.

నేను తగినవాఁడనని తలంచెదను నిత్యాలమిమ్ము నాయదృష్ట మెట్లున్నదో చూచెదను.

వసు—అందుఁ గనిపించుదానికింత యాలస్యమేల?

కాశ్మీ—(పెట్టెతీసి యాశ్చర్యముతో) ఇందేమిగలదు. ఏదో వ్రాసినదానినిఁ జూపుచుఁ గన్నుల కిలించు పిచ్చివానితల. దానిఁజదివెదను. కాశ్మీరాధిపా!

నీకును వసుమతికి నెంత వ్యత్యాసమున్నది? నాకోరికలకు నాయర్హతలకు నెంత భేదమున్నది?

చంద్రవదనావృత్తము దేనిఁబడయంగన్, తానుతగియుండున్
దానినను గోరన్, మానవుఁడు పొందున్.

నేనీ మతిహీనపు తలకంటె మతిదేని దగియుంనా? దియా నాబహుమతి? నాయోగ్యత యింతేనా?

వసు—వేషము సేయుటయు, విచారణ సేయుటయు విరు సద్భావముగల

పి వ్వేలుపసలు.

శా_స్త్రి—ఇందేమియున్నది ?

సీ ఏడుకాకలఁదీటి యుదిపరి శుభ్రమై, యొసఁగుచుండినదీతి నెప్పటికిని

పొరబాటు పడకుండ నరలు వివేకంబు, నిష్కల్మషంబౌచు నెగడుచుండు

నీడలఁగాంచి మదాంధులారికి నెప్డు చూడనీవలవంటి సుఖమెగలుగు

తగని వేషము వేసి ద్రిష్టఖండల, నెఱుఁగుదు నట్లుండె నిచయుఁగూడ

వజ్జకుఁ జేర్చుకొనుమిచ్చ వ సతిని

నీదు తలఁకుందు నేనెప్డు నిలచియుండు

నీవు తలఁచిన పనియంత నీళ్లుగారె

శీఘ్రముగఁ బురికిని దయచేయవయ

నేనిక్కడ నిలిచినకొలఁది బు హీనుఁడనే. ఒక్క తెలివిమాలిన తలతోఁ గాంతను వరింప వచ్చి యట్టి రెండుతలలతోఁ జిక్కఁబోవుచున్నాను. వసుమతీరత్నమా ? పోయివచ్చెద. నాప్రమాణ మనుసరించి సహించి యుండెదను.

(నిష్క్రమించును)

వసు—దీపమునై ప్రాలవచ్చిన మిడతవలె నీ రాకుమారుఁ డాశాభంగమొందెను మహాబు నంతు లంద లతి బు శాలి యన్ని విధములఁ జెడినట్లు నేతును.

చలు—వివాహ మరణములు విధివశములనుసామెత వృథాగాదు.

వసు—చతురికా రమ్ము. తెలివేయుము.

[దూత ప్రవేశించును]

దూత—అమ్మగారెక్కడ ?

వసు—ఎందు కయ్యాగారు ?

దూత—ఎవ్వరో ప్రభువుగారు దయచేయుచున్నారని యొకదూత ధర్మపురినుండి ద్వారముకడ నిలిచియున్నాఁడు. అతఁడు తనప్రియవాక్యములతో మంచికానుకలు తెచ్చియున్నాఁడు. కాముకులకు రాయబారము నడుపుట యందంతటి సమర్థతల చతురుని నెక్కడఁజూడలేదు.

తే. గీ. ప్రభువురాకఁదెలుపు రాయబారికివి

గాంచ ముందువచ్చు వసంతకాల దివ్య

సంపదనుసూచనముసేయు చైత్ర దినము
కూడ నింతకు ముదమునుఁ గూర్పదయ్యె.

వసు—ఇంకన ంపకము నీకాతఁడు బంధువుఁడు కాఁబోలు చీకనకు జేవ గల్పించి యి పొగడుచున్నావు. చతురికా రమ్ము. అంత రమణీయముగా వచ్చు మన్మథునంటు గాంచఁ గాక్షించుచుంటిని.

చతు—నీకంత యభిలాష కనచో వచ్చిన మన్మథుఁడు చంద్రమౌళియే యౌఁగాక! (అందఱు నిష్క్రమింతురు)

ఇది ఆచంట సూర్యనారాయణరాజుచే నాంధ్రీకరింపఁబడిన వసుమతి నాటకములో

ద్వితీయాంకము.



శ్రీరస్తు.

# వ సు మ తి.



## తృతీయాంకము.

### రంగము ౧—ధర్మపురి—వీధి.

[హరదత్తుఁడు—చారుదత్తుఁడు ప్రవేశించుచున్నారు.]

చారు—బజారులో విశేషములేమి ?

హర—ఆఁడువారు సయితము చెప్పుకొనునట్లు పెక్కు లోడలుపద్రవకరముగా నాశనము పొందిన శ్వేతద్వీప సమీపమందున్న సముద్రపు పాయలో విశేష ధనముతో నున్న సత్యకీర్తి యోడయొకటి పోయినదన్న ప్రవాద మిప్పటివఱకబద్ధమని యెవ్వరనుకొను చుండుటలేదు.

చారు—ఈప్రవాద నల్లమందు మ్రింగిన ముసలిదాని మాటవలెఁగాని మూఁడవ మనుము మగఁడు చచ్చినందుకేడ్చుచు నిల్లాలి బొ యేడ్పులవలెఁగాని కల్లయైపోయిన బాగుగానుండును నిజముగా బ్రావిడ ప్రాణాయామము కాకుండ టూకీగా నొకటి రెండుమాటలతో-యోగ్యుఁడయిన సత్యకీర్తి-మిక్కిలి మర్యాదవంతుఁడగు సత్యకీర్తి-ఆతని మరియాదను వర్ణించుటకు మాటలు లేవుకాని.

హార—వేగన గా తెమల్చుము.

చారు—నీ వేమందువు ? ఇంకఁ దెమల్చుట కేమున్నది ? ఓడ పోయినది.

హర—ఆతనికి గలుగు నష్టములలో నిదియే చివరది యగుఁగాక.

చారు—అడుగో చార్వాకుఁడు-ఆబౌద్ధపిశాచమువచ్చి యంతరాయము కల్గింపకుండ —న నలకు ప్రసంగములకు శాంతిఁ జెప్పుదము.

[చారా ఁడు ప్రవేశించు చున్నాఁడు]

మోయి చా- కా ? వర్తకులలో వార్తలేమి ?

చేయుట నాశత్రువుల పని గొప్పట. ఇన్నింటికి నేమి కారణము. నేను బౌద్ధుఁడనని బౌద్ధునికిమాత్రము కన్నులు లేవా! కాళ్లు లేవా! చేతులు లేవా! అవయవములు లేవా! ఆకారము లేదా! జ్ఞానము లేదా! అపేక్ష లేదా! హిందువులు తినెడి యన్నము తినఁడా? దెబ్బ తినినచో ఆనొప్పి లేదా? ఆరోగములు రావా? ఆమందులు కుదర్చవా? ఆయెండ కెండఁడా? ఆవానకుఁ దడియఁడా? మిమ్ముఁగోసిన నెత్తురు మమ్ముఁగోసిన నీళ్లను వచ్చునా? చక్కిలి గింతలకు మీకు నవ్వులు మాకు నేడ్పులునా? మీకు విషము విషమై మాకమృతమగునా? మీరపకారము చేసిన మే ముపకారము చేయవలయునా? అందులో మిమ్ముఁబోలినచో నిందులోను మిమ్మే పోలెదము. బౌద్ధుఁడు హిందువునకు హాని చేసినవాఁడు చూపు దయయేమి? అపకారమేనా? హిందువుఁడు బౌద్ధునకపకారముఁ జేసిన వీఁడేమి చేయవలసియుండును? అపకారమే మీరు నేర్పినది నేను చేయునది. మీబోధ చేసికొనక పోయినఁ దప్పు కాదా? అప్పుడ నండి.

(సేవకుఁడు ప్రవేశించును.)

సేవ—ఆర్యులారా! మీతో సత్కీర్తిగారు మాటలాడఁదలంచి యింటికడ నున్నారు.

హార—ఆయన నిమిత్తమే యక్కడక్కడ తిరుగాడు చుంటిమి.

చారు—వీనికిఁ బోడింకొకఁడు వచ్చుచుండెను. వీరి కిద్దఱకుఁ బోడు శని బౌద్ధుఁడై రావలెను. అప్పుడు ముగ్గురినిఁ గూర్చరా.

(హారదత్తుఁడు చారుదత్తుఁడు సేవకుఁడు నిష్క్రమింతురు)

(వినయంధరుఁడు ప్రవేశించును)

చార్వా—ఏమిరా? వినయంధరా? నవద్వీప వార్తలేమి? నాపుత్రిక కనుపించినదా?

వినయం—ఆమెనుగూర్చి వినుటయే కాని చూడలేదు.

చార్వా—అక్కడ, అక్కడ తిరుగుచున్నది నాగపురిలో రెండువేలమాడలకుఁ గొన్న వజ్రముపోయినది మా జాతికింతటి దురదృష్టమింతవఱకుఁ బట్టలేదు పట్టినట్లు తెలియలేదు. రెండువేల మాడ లందులో నష్టము ఇంకను విలువగల నగలో తనవస్తువులు ధరించి నాకాళ్లముందర చచ్చిపోయినను బాగుగా నుండెడిది. దానిని పాతిన

గల న్యాయవాది నొకని ముందే మాటలాడి యుంచుము. వాయిదా దాటగానే వానిగుండెలు తీయుంతును. వాడు ధర్మపురి దాటియుండినయెడల నేను కావలసినంత లాభము తీసుకొనగలను. వినుచుంధరా ? వెడలుము. నన్ను భజనమందిరములోఁ గలిసికొమ్ము. వెళ్లుము. భజనమందిరములో

(అందఱు నిష్క్రమింతురు)

---

రంగము ౫ — మహేంద్రపురి, వసుమతీ గృహము.

---

చంద్రమౌళి, వసంతకుఁడు, వసుమతి, చతురిక అనుచరులు [ప్రవేశింతురు]

వసు—ఆర్యా! నా ప్రార్థన మంగీకరించి తమరొకటి రెండుదినములు పెట్టెలో కెంచుకొనకుండ నాగియుండుదురు. మీరు తప్పుపెట్టె నెంచితిరేని మీ సహవాసము వెంటనే విడువవలసి వచ్చును. కావున తాళుఁడు. తమకును నాకును సంఘటన కలుగునని తోఁచుచున్నది. కాని యట్లూహ కలుగుటకు మోహము కారణము కాదు. మోహము కావున నసహ్యమనుకొందురేమో. నా యభిప్రాయము పూర్తిగాఁ దమకు బోధపడినదో లేదో (ము ల కభిప్రాయము సరిగా తెలిపుచ్చలేదు) మీరీపెట్టెల నెంచుకొనుటకు ముందుగా నొకటి రెండుమాసములు మీ రూరకుండుట నాకోరిక. సరియగు పెట్టె నెంచుమార్గము నేను చెప్పఁగలను. గాని యట్లు చేసినచో ప్రమాణము తప్పినదాననగుదును. కావున నట్లెన్నఁడును చేయను. ఆలాగునఁ జెప్పకున్నచో మీరు సరియగు మంచస మెంచకపోదురేమో. అట్లు తప్పిపోయినయెడల ప్రతిజ్ఞోల్లంఘనము చేసి సరియయినది చెప్పలేక పోతినిగదా యను పాపపు తలంపున కెడమీయ వలసివచ్చును. మీ దృష్టియందేమి మహత్తున్నదో కాని నన్ను లొంగదీసికొనినది. నన్ను భాగించినది. నాలో సగము మీది. తక్కినదికూడ మీదే కాని నా దనవలసి వచ్చుచున్నది. నాదన మీదే కావున నంతయు తమదే. హక్కుదారులు తమ హక్కు ననుభవించుటకు నడ్డపడు దుష్కాలము వచ్చినది. కావున నేను తమదాననైనను మీదాననుకాను. ఆలాగుననే తటస్థమయినచోఁ బాపమంతయు భాగ్యదేవతదే కాని నాది కాదు. మీతో ముచ్చటించుచుఁ గాలయాపనము సేయుట కింతవఱకుఁ జెప్పితిని. మీరట్లయిన — మతి యొ చుకొనుఁడు.

(చతురికాదులు పాడుదురు.)

ద్విపద. తనరంగ మోహంబు తలఁచి చూడంగ
మనసునఁ బుట్టునో మస్తకంబుననో
ఏరీతి బుట్టునో యెందు గన్గొడునో
యేరీతి చక్కఁగా వృ చెందెడునో.

ప్రత్యుత్తరము.

ద్విపద. కన్నులలో బుట్టి కనులలోఁ బెరుఁగు
కన్నులలోనది క్రమముగా సమయు
భ్రాంతియంతయుఁ జూడ భ్రష్టమటంచు
సంతసంబున నీడె చాటంగ వలయు.

(నే పద్యంబున ధ్వనులు)

చంద్ర— కావున పైపూతలు నిజముగు పూతలా

తే. గీ. భూమిపై మె  ంగుల చేత మోసపోవు
మూరకును రుచి పోపుచేఁ  ర్చినట్లు
న్యాయవాది చక్క  చర్చ నడిపె ని
దోషమయిన దోషంబు గాఁ దోఁచఁబడదు.

క. హీనంబగు మత దోషం
బైన నదోషముగఁ జేయ నాచార్యుండే
దోని  మాధారమును న
వీన  గాఁ జూపి గప్పి వేయును తప్పన్.

ఎంతప శు మయిన దోషమయినను బాహ్యమునకు గొంత మంచి గుణమున్నట్లు కాన్పించును.

తే. గీ. లేని ధీరత్వ మెవలోనఁ బూని, వారి
శౌర్య మిసుక మెట్లవలెనె తనరుచుండ
బిరికి వాండ్రెంప బున్నారు భీష్మునివలె
వీర  షంబు దాలిచి వెలయువారు.

అల్పవారిని నిదా  చినచో వారి దేహమున రక్తమునకు బదులు నీరేయుండి యీవీర వేషములకే నిజముగా వారు భయపడుదురు. ఇంకఁ జక్కదనమో? అలంకారవ్య

నిట్టి ప్రియమగు మిత్రుల కట్టు పలుక్కు-
చున్న విధమున వ్రాయుటే యుత్తమంబు.

ఈ చిత్రకారుడు సాలెపురువువలె నటించినాఁడు.

తే. గీ. వాటముగఁ జెల్లి కట్టిన గూటఁ బాద
మూను నీఁగలలాగున నుంగరములం
జుట్టుకొని కంటి కింపైన సుదతికరులఁ
జిక్కువడియెడు పురుషుల చి ములును.

మ. ఒక నేత్రంబు ముగించి వంతనె తదీయోన్యేమముంజూచి వా
నికనల్ రెంటను మిత్రిటున్ గొని యిఁకన్ జేయాడకుండుంగదా
వికచాంభోరుహ నేత్రరూపమును దా విన్నాణ మొప్పన్ విలే
ఖుఁడు జేరీతి ముగింపఁగాఁ గలిగెనో కల్గించు నాశ్చర మున్.

తే. గీ పలువిధమ్ముల నేఁ జేయు వర్ణనలను
పటపు సౌందర మున కాంతి వాసి గలదో
పట్టి చూడన నా యెవాసి పటమునరసు
వసుమతీకాంత దివ రూపంబు కను.

నాభాగ ఫలిత మంతయు నిచ్చట వ్రాయఁబడినది.

పైడాబు పరికించి భ్రాంతిఁ జెందకయుండి చేఁగి పెట్టెలను గొంచితివిగాన
నీయదృష్టము చేత నిజమైన పెట్టె గొంచితివయ్యా చూచి యెంచినవిధాన
ఈభాగ మునుఁ బొంది యు దృ నిఁ జెంది క్రొ భాగ ను పు గోరకయ
ఈమహా ప్రష్టంబు చేను గన్న నీకు గాఢసంతోషంబు గ గె నని
కోరకొనిన భాగ్యంబు చే కూరినట్లు
ంతసి చితి వేని బల్ సంభ్రమమున
సతీ త్నమును —చి నెమ్మి ముచ్చ
టాడు కొనవయ్యా ప్రీతి ముద్దాడుకొనుచు.

చక –గా వ్రాయంబడినది. సుందరాం ! నీసమ్మతిఁ గొని ముద్దుఁగొనియెద (అని ముద్దిడు ముద్దిచ్చి నిన్నుఁ జేపట్టుటకై వచ్చియుంటిని. ఏదయిన బహుమానముఁ గొన యత్ని చు ని టిలో నొకనిఁ జూచి జనులు తమ సంతోషము చేఁ గరతాళధ్వనులు చేయుచున్న వాఁడు సందేహియై తననిమి మే యిట్టిస తోషముఁ జూపు చుం

డిరో లేదోయని యనుమానించు వానివలెనే నిప్పుడు నాభాగము నను నమ్మలేకున్నాను నేను సరిగా జయమొందితి ననియు నీవు నన్నుఁ బ్రేమించితివ యని నాకు నమ్మకముఁ బుట్టఁ బలికినయెడల నా సందేహము తీరిపోవును.

వసు—ప్రియుఁడా! చంద్రమౌళీ! తమ రిచ్చట నే నన్నుఁ జూచుచున్నారు ఇంతకంటె నధికము నే నేమియుఁ గోరను. కాని మీ కానందనము కలిగించుటకొఱకై యింతకంటె నెన్నియో మడుంగులెక్కువ యందముగాను, భాగ్యవంతురాలిగను నుండి నబాగుగా నుండునని తలంచెద నే నెంత భాగ్యగుణరూపసంపదలఁ జెలఁగియున్నను తమ కడ నెందుకుఁ బనికిరాను, నే నధికవిద్యావంతురాలను గాను. ప్రపంచానుభవము లదా సు కాను. కాని లేబ్రాయమగుటచే మీ కడ నింక సుగుణసంపదలు నేర్చుకొనుట క కాశము కలదు. నేర్చుకొనలే ంత మొంగుతనము నాకు లేదు. కావున నీచేత నిదా ని ప్రభువునకును, అధిప కిని చ న . . కొనుడు. నేను నా సర్వస్వము మ య నము ంతవఱకు నావశమందున్న యీ దివ భవనము, యీ దాసదాసీజనము ఈ యైశ్వర ఇంతటినుంచి తమ సొత్తుగా నీయుంగరముతో నప్పగించుచుంటిని తమ రీయుం రము విడువరాదు. పోగొట్టుకొనరాదు. ఇతరుల కిచ్చివేయరాదు. ఎప్పు డయిన నట్లు జరుగు నెడల నంతటితో మన ప్రేమ యంతమే.

చంద్ర—కలభాషిణీ!

తే. గీ. నీ మధురవచో సనా స నిర్మలత ఁ
గలుగు నా ంద మధి మై గ్రాలుచున్న
ంత కాదున్న దానిలో గొం యైన
తెలుపుటకు మాటలేవియుఁ దెలియకుండె.

ఇదానమ్మ ము నేలు ప్రభువు మధురోపనా మిచ్చెనేని ప్రజలు సంతోషసం భ స్వాంతులై యేమి పలుకుటకును దోఁచని ందమున నాకేమియు దోపకున్నది. ఆ మూహములో నెవ్వ రేమి చె ఁదలంచినను ంతోషమే కదా. కోమలీ! నీయుం గరము మెపుడు నాౘ్రేలి నెడబాయునో య .. చంద్రమౌళి గతించునని తలంపుము.

చతు—వధూవరులారా! మీరుభయు లన్యోన్య ము రించిరి కావు మీదాం పత్యము సుఖముగా వ వలయునని చెంతను దుర్వారమగు మూత్రాప వ. మీకు సంతోష గాక. మీ దాంప త్య మభివర్ధిల్లుఁగాక.

వసంత—చంద్రమౌళిగారూ! అనుగారూ! మీ కోరుసంతసంతోషము మీకుఁ

గలుగుఁగాక. మీ యవసరము లేకుండ మీరుఁ గావలసినంత సంతోషమున్నదని నా నమ్మకము. ఇంక మీ పరిణయము జరుగు తచ్ఛుభముహూర్తముననే నాకుఁగూడ వివాహమగుఁ గాక.

చంద్ర—నీకుఁగూడ కన్య యమరెనేని నీ వివాహముకూడ జరుగుట పరమ సమ్మతము.

వసం—చిత్తము. మీ యనుగ్రహముచే నాకుఁ గూడ భార్య యమరినది. తమ వలెనే నేనును కన్యను వెతకితిని. మీరు వసుమతీకాంతనుఁ గోరగా మీ మిత్రుఁడనగు నేను ఆమె చెలికత్తెయగు చతురికను వరించితిని. ఇంక చాలను చేల. తమ యదృష్టము మందసములలో సరియైనది యెంచుటఁబట్టి యుండెను. నాకును అట్టి చిక్కు కలిగిన. ఆమెను వరించుటకు నెంతో చెమట యూడ్వవలసివచ్చినది. నాకుండు ప్రేమ యదార్థమైనదని తెలుపుటకై నేను చేసిన శపథములతోను ఒట్లతోను ఇంటికప్పు నిండి యినది. వసుమతినిఁ దమరు వివాహమైనచో (చతురికనుఁజూపి) నన్నామె పెండ్లియాడును.

వసు—సఖీ! చతురికా? నిజమేనా?

చతు—సఖీ! నీకు సమ్మతమైనచో నిజమే.

చంద్ర—వసంతకా! నిజముగా నీ కన్యను వరించితివా?

వసం—నిజమే.

చంద్ర—మీ మీ వివాహముకూడ జరుగుటచే మావివాహమునకు మరింతశోభ.

వసం—ఆ వచ్చువారెవరు? ఓహో ప్రభాకరుఁడు. అతని భార్యయునా? ఏమీ ధర్మపురిమిత్రుఁడు చారుదత్తుఁడు!

(ప్రభాకరుఁడు, పత్ని, చారుదత్తుడు ప్రవేశింతురు)

చంద్ర—ప్రభాకర చారుదత్తులు దయచేయుండి. నాకు నూతనముగాఁ గలిగిన యధికారముచే నిక్కడ మిమ్ము మరియాదచేయుటకు వీలుపడినది. ప్రియసతీ! యనుమతిచే నాదేశమిత్రుల గౌరవించుచుంటిని.

వసు—నేను నట్లే చేసెదను మంచిదే. వారి కవశ్యము మరియాద చేయవలెను.

ప్రభా—అయ్యా! వందనములు. మీదర్శనము చేయుటకు నిక్కడకు రాలేదు. మార్గములో చారుదత్తుడు కలిసికొని నేనెంత బ్రతిమాలినను వినక తనతో రమ్మని బలవంతపెట్టె.

నాతో చెప్పకుము-వడ్డిలేకుండ నిచ్చెచ్చు తెలివితక్కువవాఁ డితని జాగ్రత్తపెట్టుము.

సత్యా—నీవు మంచివాఁడవు. చార్వాకా? నామాటవినుము.

చార్వా—నాపత్రమే నాకుఁ గావలయును అందుకు విరుద్ధముగా నీ వేమియు బలుకకుము. పత్రప్రకరతుల ప్రకారము నడుచుటకు నేను శపథము చేసియున్నాను.

తే. గీ. చాలు లేపొమ్ము నీవు నిష్కారణముగ
కుక్కయని నన్ను తిట్టి నా వొక్క మొగిని
నీవు తిట్టిన విధమున నేను కుక్క
నౌదుగాన నాకోఱల నరసియుండుము.

మహారాజుగారు న్యాయము దయచేసెదరు. కారాగారాధిపా! ఆతని కోరిక ననుసరించి యాతని విడిచిపెట్టుట కాసించినట్లు తోఁచుచున్నది.

సత్యా—నా ప్రార్థనవిని నామాఁటవిని చిత్తగింపుము.

చార్వా—నాపత్రమే నాకుఁ గావలయు. నీమనవి వినను. పత్రములో నున్నట్లు సేయక మానను. ఇంక నీవిషయమయి మాటలాడకుము. ఈ హిందువుల టక్కరి బ్రతిమాలునకు తలయూఁచి జాలిపడి కనికరించుటకు నేనంత గ్రుడ్డివానినిగాను. నావెంట రాకుము. నాతో మాటలాడకుము. నాపత్రమే నాకుఁగావలయు.

(అని నిష్క్రమించును)

హార—మనుజులతోఁగూడ సంచరించు కుక్కలలో నింత రాతిగుండెకల కుక్కయిదే.

సత్యా—వానినిఁ బోనిమ్ము. ఉపయోగములేని ప్రార్థనలతో నే నాతని వెంబడింపను. నాప్రాణముఁ దీయ తలంచినాఁడు. ఆకారణము నేనెఱుంగుదును. వెనుక వీని కఠినమగు వలలో దగుల్కొని నన్ను ప్రార్థించెడి వారి నెందఱినో కాపాడితిని కావున నామీఁద కోపము.

హార—మహారాజుగారీ దావానుపట్టి పరిహార మిప్పింతురని నేననమ్మను.

సత్యా—మహారాజుగారు చట్టమును తప్పింపలేరు. ఈ పట్టణములోని వర్తకలాభము అన్నిజాతులవారికిఁగల దుకాన నీదేశమునకు వచ్చిన యితరుల స్వేచ్ఛాధికారము తిరస్కరింపఁబడిన రాజ్యముయొక్క న్యాయమార్గమునకు భంగము రాఁగలదు. కావున నన్ను చవెళుము. నాకుఁ గలిగిన చింతచేతను నష్టములచేతను నాశరీరము కృశించియున్నది. కాఁబట్టి రేపు నాఋణదాతకిచ్చుటకు సేరుమాంసమయిన నాయొ

ప్రభా—అమ్మా ! నా మనఃపూర్వకముగా మీయాజ్ఞల మన్నింతును.

వసు—నా నవుకరులందఱు మిమ్మును పద్మినినిగూడ నెఱుంగుదురు కావున మీయాజ్ఞల మన్నింతురు. కావున నాకును నా భర్తకును బదులుగా మీరు వారినిఁ జూచుచు తిరిగి మేము వచ్చునఱకు కట్లు సేయుఁడు.

ప్రభా—మంచియూహలతో సుఖముగాఁ గాలము పుత్తురుగాక.

పద్మి—మీ కోరికలు సిద్ధించుఁగాక.

వసు—మీ రిట్లు కోరినందు కానందమయినది. మీకుగూడ నట్లే నాయాశీర్వాదము. పద్మినీ పోయిరమ్ము.

(పద్మినీప్రభాకరులు నిష్క్రమింతురు).

కంచుకీ ఇదివఱకు నీ వెంత మరియాదగలవాఁడవై విశ్వాసపాత్రుఁడ వయితివో యిఁక ముందుఁగూడ నట్లే యుండవలెను. నీ వీయుత్తరమును గైకొని నేను [illegible] యినంత శీఘ్రగమనమున నాకాసురపురి కేగి నా బంధువు వసు వాచాలునిగారి కిచ్చి యాయన తిరిగి యిచ్చు నుత్తరమును దుసులును పుచ్చుకొని [illegible]నో వేగముతో ధర్మపురికై పోవు రహదారిపడవలోఁ గిఁ దెమ్ము. ఒక మారుమాటాక పొమ్ము. నీ రాక నిరీక్షించుచుఁ బడవకడ కంచెము దుగా నుందును.

కంచు—అమ్మగారూ సాధ్యమగునంత త్వరితముగాఁ బోయివత్తును.

(అని నిష్క్రమించును)

వసు—చతురికా ! రమ్ము. ఇదివఱకు నీ కెఱుఁగని పని యొకటి కలదు. మన భర్తలు మనల నానవాలుపెట్టకుం వారినిఁ జూచెదము.

చతు—వారు మనలఁ జూచెదరా ?

వసు—చతురికా ! చూచెదరు కాని మాయిరూపములో మన మెవ్వరము కావారలమే యని వారనుకొందురు. మన ము యుగలము తె నాయుక్కలగు పురుషవేషముల వేసినపుడు నేను కత్తి ధరించి యొక్కవ డాబుగాఁ గనుపడి సునయనా ధరణి నేనే మిగుల ధైర్యముగా చకచకలాడునట్లు కాంతువని పందెము వేసెదను. బాలుఁడు పురుషుఁడగు పుడు మారెడు కంఠధ్వనితో మాటలాడెదను పురుషుఁడు కంఠ ము నొయ్యారముతో గెండడుగులు నడుతును. అందమగు యౌవనపురుషునివలె నామ సంగములఁ జేసెదను. మరియాదవంతులగు కన్యకామణులు నన్ను కామించిరని

యు నేను తిరస్కరింపఁగానే వారు మనోవ్యథతో దళమూవస్థకు వచ్చిరనియు, వార ట్లు మోహింపకుండ నుండలేకపోయిరనియు, తరువాత పశ్చాత్తాపము కలిగి జాలితో వారికోరిక నంగీకరించినట్లు నటించగానే వారికిఁ బ్రాణము లేచివచ్చిన ట్లయినదని యు నబ ము ు పల్కెదను ఇట్లెన్నియో బాసలుచేసి యేడాదిక్రింద బడి నూసిన వానివలె గాన్పింతును. మాణవకులు సేయు వేలకొలఁది చమత్కారములు చిత్రములు నే నెఱుంగుదును. బండి మనకై ద్వారముకడ నిలిచియున్నది కావున బండి యెక్క నేను చేయఁదలఁచిన పన్నాగమంతయు జెప్పెదను రమ్ము. త్వరపడుము. నే డిరువది మైళ్లు పె వలయును.

రంగము ౫.—ఉద్యానవనము.

---

[గోపాలదాసు—ప ్ని ప్రవేశింతురు

గోపాల—అవునుగాని చూడు తండ్రిపాపములు పిల్లను చుట్టుకొనును. కాఁబ ట్టి నీకై నా కెంతో భయముగా నున్నదిసుమా. నే నెప్పుడు తో మాయమర్మ ములు లేకుండ మాట్లాడుదును. కాఁబట్టి యిప్పుడు సంగతి చెప్పెదను. కులాసాగా నుండుము, నిజముగా నీవు పతితురాలవయితి వనుకొందును. నీకు మేలుసేయు నుపా యమున్నది కాని యడియును పా ప్రదమే.

ప ని—అది యేమి యుపాయమో. చెప్పుము. ప్రా ంతును.

గోపా—నీ తండ్రి నన్నుఁ నలేదని నీవు బొద్ధునికుమార్తెవు గావని తలంపుము.

పద్మిని—మి క్క పాపపుతలంపు. అయి ను నాత పాపములు నన్నుఁ జుట్టు కొనవా ?

గోపా—అట్లయిన నీ తల్లిదండ్రు లుభయులచే నీవు పతితురాల వయితివని భ యమగుచున్నది. త డ్రినిఁ దలఁచిన చెంపపెట్టు. తల్లి ఁ ద చిన గోడపెట్టు. రెంటి కిఁజె రేవణవైతిని.

పద్మిని—నా భ నన్ను రక్షించును. న్ను ంధువుగా మార్చినాఁడు.

గోపా—నిజముగా నిందార్హుఁడే. కా లసినమంది హిం వు లిడివటికే యు న్నారు. ఇఁటివటికు హాయిగా జీవించుచున్నారు. ఇంకను హిందువు , మార్చిన

మొదట పండుల ధర హెచ్చును. అందువలన పండితులాంతా సభకు కుఱవలే మైనరియోడెల వింత సా
క్షిచ్చికొండమన్నను రొట్టె దొఱకుట దుర్లభమే.

(ప్రభాకరుఁడు ప్రవేశించును).

పద్మిని—గోపాలదాసూ ! నీవు పలికిన మాటలు సాభర్తతోఁ జెప్పెదను. ఆయ
నవచ్చుచున్నారు.

ప్రభా—గోపాలదాసూ ! నా భార్య నిట్లు మూలమూలలకుగాని పోయినచో
నేను సహింపనునుమా.

పద్మిని—మీరందుకు భయపడకుఁడు మే మిద్దఱము తగవు లాడుచున్నాము.
నేను బౌద్ధుని పుత్త్రికను గనుక నాకు స్వర్గసుఖములేదని స్పష్టముగాఁ జెప్పుచున్నాఁ
డు. మీరును జనసమూహములో మంచివారు కారట, ఏలననగా బౌద్ధులను హిందు
వులగా మార్చినరియెడల పండుల వెల హెచ్చుటకు కారకులగుదురట.

ప్రభా—కం. అసరసుఁ డీతఁడు విసువక
వస ద్రాగిన చిలుకలాగు వదరుం జూ స్త్రీ
బిసరుహముఖి యీతనితో
బొసగదు మాటాడ మౌనము వహించుట మేల్.

ఓయీ ! నీవు వెళ్లి వంటవారిని భోజనమునకు సిద్ధముగా నుండుమనుము.

గోపా—వారలు సి ముగా నున్నారు.

గోపా—వారలు సిద్ధముగా నున్నారు. వారి కాకల్లు గలవు.

ప్రభా—ఏమి తెలివి ! వంట సిద్ధము చేయుమనుము.

గోపా—అదియు నయినది. విస్తళ్లు వేయుట తరవాయి.

ప్రభా—నీవు వేసెదవా ?

గోపా—నేను వేయను. అది నాపని గాదు.

ప్రభా—ఒక టనిన వేఱొక టూహింతువు. నీ తెలివంతయును నిచ్చుట నే యుప
యోగింపవలయునా ? తిన్నగా విను. మేము భోజనమునకు వచ్చుచున్నాము. వ ంచ
మని చె ము.

.. పా—విస్త వేసి వ ంతురు. తమరు దయచేయుట తమ చిత్తము.

(నిష్క్రమింతురు)

ప్రభా—ఏమిచక్కని తెలివి ? వీఁడు పట్టి మాటలపోగు. ఇంటువంటివాండ్రు తమ తికంటె నెక్కువగా నున్నట్లుండి ఎంతటిస్పష్టమయిన మాటనయిన విఱిచి మాఱు ము సేయువారి నెంపటినో యెఱుంగుదును. పద్మినీ ! ప్రాణేశ్వరీ ! వసుమతిని గూర్చి నీ యభిప్రాయ మేమి ?

పద్మిని—చెప్పవలయా ! చంద్రమౌళి బుజామార్గప్రవర్తకుఁడైనయెడల వసుమతి తో సంసారము చేయుచు భూలోకస్వర్గ మనుభవింపఁగలఁడు అలాగున ననుభవింపఁ డేని నిఁక వాని కెన్నఁటికి స్వర్గసుఖమే దొఱకదు. దేవశిల్పిద్దఱు చక్కని స్త్రీ నెంచఁ బందెమువేసినచో నొ తె వసుమతి. ఆమెలో సంపన్నత సరిపోవునని మ యేకా తామణిని దెచ్చినను, వసుమతితో సరిబోలుటకు నా కాంతను నింక నేమయి సమమూ వలెను. వసుమతినిఁబోలు చక్కని కాంత నింక లోకమందు లేదు.

ప్రభా—ఆమె యెటువంటిభార్యయో నీకు నే నటి భ ను.

పద్మి —ఆవిషయమై కూడ నా యభిప్రాయ మడుగుదు.

ప్రభా—అలాగే. భోజనమునకు పద.

పద్మిని—ఆకలి వేయుచున్నను ని న్నొకసారి  తి సేయనిమ్ము.

ప్రభా—ఇప్పుడువద్దు. భోజనసమయమునఁ జె ప్పకొందము. నీ వేమి చెప్పిన ఠక్కినవానితోబాటు జీర్ణము చేసికొనెద.

పద్మిని—మం . అ గే చెప్పెదను.

(నిష్క్రమింతురు.

ఇది ఆచంట సూర్యనారాయణరాజుచే నాంధ్రీకరింపఁబడిన

వసుమతీ నాటకములోని తృతీయాంకము.



శ్రీ రస్తు.

# వ సు మ తి.



## చతుర్థాంకము.

### రంగము ౧—ధర్మపురి—సభాస్థానము.

మహారాజు, పరివారము, సత్యకీర్తి, చంద్రమౌళి, వసంతకుఁడు, హరదత్తుఁడు, చారుదత్తుఁడు, ప్రవేశింతురు].

రాజు—ఏమీ! సత్యకీర్తి యిక్కడున్నాఁడా?

సత్య—ప్రభువువారి సెలవుప్రకారము సిద్ధముగా నున్నాడు.

రాజు—ఓయీ! నిన్నుఁ జూచిన నెంతో విచారము కలుగుచున్నది.

తే. గీ. కోపి చూచిన నెడు నే కోశమందు
దయయు దాక్షిణ్య మించుకంతయును లేని
* కఠినశత్రువు మూఢముష్కరున కీవు
బదులు చెప్పఁగ వలసిన వాఁడవైతి?

సత్య—మహాప్రభూ! ఆతని క్రౌర్యముఁ దగ్గించుటకై దేవరవారెంతో శ్రమపడిరని వినియున్నాను.

తే. గీ. వాఁడు పట్టిన పట్టును వదలకుంట
నన్నుఁ దప్పింపఁగాఁ జాలు న్యాయమైన
సాధనం బేమి లేకుంట శాంతమతిని
వాని క్రౌర్యకోపంబుల పాలఁ బడుదు.

రాజు—ఒకరు వెడలి యాబౌద్ధుని రమ్మనుఁడు.

చారు—దేవా! ద్వారముకడ సిద్ధముగా నున్నాఁ డిదె వచ్చుచున్నాఁడు.

[చార్వాకుఁడు ప్రవేశించును].

రాజు—తొలఁగుఁడు. ఆతని కూర్చెట్టుట నిలువనిండు. ఓయీ చార్వాకా!

---

* ఖాతిగుండెకు ముష్కరారాతి కీవు అని పాఠాంతరము.

తే. గీ. ఇట్టికోపపద్ధతిఁ గడమట్టఁ జూపి
తుదకుఁ గ్రౌర్యంబు విడిచి యద్భుతముగాఁగ
నతని దయఁజూచి జాలిమై నాదరింతు
వనుచు లోకులతోఁ బాటు నాత్మఁదలఁతు.

సీ. కోటీశుఁడగు వర్తకునినైనఁ గ్రుంగించి నేలంటఁగొట్టంగఁ జాలియుండు
పెక్కులౌనష్టమ్ము లొక్కమ్మడిని గ మ్మి ప్రతివాదియున్న దు తిని జూడ
వజ్రకాఠిన్య స్వభావులై యుపకా మనుమాట కలనైన నఁగరాని
ముష్కరక్రూరతురుష్క తార్తారుల రాతిగుండెలును కరఁగిపోవు
గాన మనుజ సామాన్యమౌ కరుణఁజూపి
పత్రమునుబట్టి నీవు రాఁబట్టఁ దలఁచు
వర్తకుని నేనుమాంసంబు వదిలిపెట్టి
బు ధనమ్మున గొంతఁ ద ంపవయ్య.
సర మగు సత్త్వర మానించి యుంటిమి సుమా బౌద్ధుఁడా!

చార్వా—నా యభిప్రాయ మిదివఱకే యేలినవారికి విశదపఱచుకొని యుం టిని. పత్రము గడువు మించుటచే నాకు రావలసిన పరిహారము విడువని శపథము చేసి యున్నాను వల్ల కాదందురేని మీరు చేసిన చట్టములకును మీరొసంగి స్వాతంత్ర్య ములకును భంగము రాఁగ దు.

తే. గీ. మూఁడువేల మాడలు నేను కొనక
నేరు నరమాంస శకలంబు గోరుటకును
హేతువేమని యడి గెద రేని గొ వినుఁడి
నరునిమాంసంబుఁ గొనుటయే నాకు హితము.

తమ సమాధానముఁ జెప్పినవాఁడ నయితినా ? నాయింట నెలుకల బాధ పడ లేక వానినిఁ బట్టుకొనువా కిఁ బది వేలమాడలం బహుమాన మిచ్చెదననుకొనుడు. అయి తే నేమి. మీకు సమాధానమయి నా ? ముట్టి తెఱచుకొని చ్చు పందినిఁ జూచిన నస హ్యపడువారు కొందఱు. పిల్లినిఁ జూచిన పిచ్చెత్తువారు కొందఱు. తిత్తి ఊమనఁ గానే కొందఱు వికక నవ్వుదురు. కావు మయు, నసూయయు, నిష్టము నను స ంచి డును — తగినం కా ము లయియుండును. పంది, తిత్తి వీనినిఁగూర్చి వా రారీతిఁ జే టకేమి కా ణము లు వి? ఇ స్తువు నుఁ జూడఁ దనమనస్సున

కసహ్యము కలుగఁగా; దన్నితరులు చూచి యసహ్యించుకొనునప్పు డాసిగ్గు తప్పక యనుభవింపవలసినదే. అందుసఁ గారణము చెప్పలేను చెప్పను. చిరకాలమునుండి నామనసులో నాటుకొనియున్న యొక విధమగు నసూయకొలఁది నేను వీనితో దండుగవ్యాజ్యము పాడుచున్నాను ఇంక మీకు సమాధానమైనదా ?

చంద్ర—ఓదయావిహీనా ! నీ క్రౌర్యప్రవాహము త ంచుట కిది సరియైన సుత్తరము కాదు.

చార్వా—నా యుత్తరములతో నిన్ను సమాధానము పెట్టవలసిన ప్రసక్తి నాకు లేదు.

చంద్ర—తాము ద్వేషింపని వానినన్నిఁటినిఁ జంపివేయుదురా ?

చార్వా—చంపఁదలంపని వానిపై నసహ్యముండునా ?

చంద్ర—ప్రతినేరము మొట్టమొటనే యసహ్యమునకు హేతువు కాదు.

చార్వా—ఏమీ ! నీవు పాపములచే రెండుసారులు కరిపించుకొందువా ?

సత్య—మిత్రుఁడా ! నీవు బౌద్ధునితో మాటలాడుచుంటివి వని రోయుంగము.

సీ. మున్నీటికడ కేగి పొంగిపడకుమంచుఁ జేయెత్తి యానతి సేయవచ్చు.
పిల్లకై గొఱ్ఱెనేడ్పింప నేమిటికంచు తోడేలితో వాదులాడవచ్చు.
పెనుగాలిలో నూగి నిసేయువద్దని రోసి ప్రమాకులను శాసింపవచ్చు.
ఇంక నీజగతిలో నెట్టి యసాధ్యంపు పనినైన సలుపంగవచ్చుఁగాని
బౌద్ధుని మనంబు మార్పంగ వశము గాదు.
వలదు మీ కింక వానితో వాదు లేల ?
వేగముగఁ దీర్పు నా పైని సాగనిండు
జైను నభిమతంబే కొనసాగనిండు.

చంద్ర—నీ మూడు వేలమాడల కివిగో యాఱువేలు.

చార్వా—తే. గీ. ఆఱువేల మాడలలోన నరయ నొకొక
నిష్కమాఱుభాగంబులై నెగడుచున్న
భాగ మొక మాడయైనను వలదు నాకు
పత్రినుం దియ్యఁబడు ప్రతిఫలము తక్క.

రాజు— వెవ్వరికిఁ గరుణజూపనిదే దానిని నీవు మాత్ర మొల్లాసింతువు.

చార్వా—తప్పు సేయనిదే తీర్పునకు నే నేల భయపడవలెను ? తమ రెంతటినో

చార్వా—ఆ దివాంధకోర మాంసముఁ గోయుటకు.

వసంత—జోడీచస్త్రములపై కాదుగాని నీ శిలాహృదయముపై నూఱుచున్నావు. నీ లోహమునకైనను తుదకు తలవరి గండ్రగొడ్డలికైనను నీ క్రౌర్యమునకున్నంత వాఁడి లేదు. ఏవిధమయిన ప్రార్థనలు నిన్నుఁ గరగింపలేవా?

చార్వా—నీ చేతను గాదు

వసం—ఛీ! నీయాయువు మట్టము కానూ! పశుప్రాయుఁడా! శునకసమానా! నిన్నుఁ బుట్టించినందుకు దేవు ననవలె.

సీ. నమ్మకమున్నవు నష్టమనుచున్న లేదన్న నిప్పుడు నాకుఁ గలిగె
దొల్లి నీదుష్టాత్మ తోడేలు దేహంబు చేరి మానవహింస చేయుచు తన
సుకృతి యుఁబడుచుండె నచ్చోటనుండియే కలుషాత్మ నీతల్లి కడుపు చేరి
నీదుష్ట దేహంబులోఁ దూరి యీరీతి మానవాకృతితోడ మహికివచ్చె
కావున నెనీదు కోర్కెలాకలిని గొన్న
పుట్టి తోడేలి కోరిక లనుసరించి
నరుని రక్తమాంసంబుల నరయుచుండె
గాక యింకేది హేతువీ క్రౌర మునకు.

చార్వా—ఈకూఁతలవల్ల పత్రము ధ్వంసము కాదుగదా? ఈకంఠశోషణ మెందుకు?! కట్టివాఁడా? నీ యతివాగుడు తనము మాన్పుకొనుము లేకున్న నాకుఁ దగ్గదు. ఇక్కడ నేను చల్పములఁబట్టి నిలిచితిని!

రాజు—చిన్నవాఁడును విద్వాంసుఁడును నైన నొక న్యాయవాది సభవారివలన గౌరవింపఁబడుటకై కోరి యీయుత్తరము వాచాలుఁడుగారు వ్రాసినారు. ఆయన వచ్చినారా?

చతు—ప్రభువువారి సెలవునకై నిరీక్షించుచు నావల నున్నారు.

రాజు—పరమసంతోషముతో మనఃపూర్వకముగా రానిత్తము. మీలో నిద్దఱు ముగ్గురేగి సగౌరవముగా వారిని తోడితెండు. ఈలోపల వాచాలుడుగారియుత్తరము సభవారు విందురు. (చంద్రపాళి వసంతకుఁడు నిష్క్రమింతురు)

(గుమస్తా చదువుచున్నాఁడు) మహారాజా! ప్రభువువారి యుత్తరము నాకందు నప్పటికి నేను దేహస్వాస్థ్యము లేకయుంటిని. కాని మీరుపంపిన సేవకుఁడు వచ్చు టకే హేలాపురినుండి నన్నుఁ జూచుట కొక న్యాయవాది వచ్చియున్నాఁడు.

ఆయన పేరు సత్యకీర్తి. చార్వాక సత్యకీర్తులకు జరుగుచున్న వ్యాజ్యమునుగురించి యీయనతో ముచ్చటించితిని మే మనేక గ్రంథములఁ బరిశీలించి నాయభిప్రాయమీయనకుఁ దెలియఁజేయుచున్నాను. ఆయభిప్రాయ మాతని ప్రజ్ఞావిశేషములచే బహువత్తమయి ప్రభువారి కోరికప్రకారము నేను రాని లోపమాత్రఁడు నివారింపఁగలండు ఆతని ప్రజ్ఞావిశేషములు తెలుపుటకు నాకు వశముగాదు. ఆతని చిన్నతనముఁబట్టి చిన్నచూపు చూడకుందురని నా యాశయము. ఏలనన నంతటి పిన్నప్రాయమున నంతటి బుద్ధి కుశలుని నెక్కడను చూడలేదు మీ యనుగ్రహానుసారముగా యీయనను జూడగోరుచున్నాను పిమ్మట నాతని తెలివితేటలు ప్రజ్ఞావిశేషంబులు తమకే తెల్లములు కాఁగలవు.

రాజు—విద్వాంసుఁడగు వాచాలుఁడుగారు వ్రాసినది విన్నారుగదా. ఆప్రకారము మంగీకరించితిమి. ఆయన దయచేసినారా ?

(న్యాయవాదిరూపముతో వసుమ ప్రవేశించును).

దయచేయుడి. వాచాలుఁడుగారు పంపఁగా దయచేసినారా ?

వసు—చిత్తము. దేవా ?

రాజు—మీరాక పరమసంతోషము. తమ స్థానమలంకరింపుఁడు.

వసు—(కూర్చొనును)

రాజు—ప్రస్తుత మీన్యాయసభలో జరుగుచున్న వ్యాజ్యమునుగురించి మీ రెఱుంగుదురా ?

వసు—ఆవ్యవహారము పూర్తిగా నెఱుంగుదును. ఆ ర్థకుఁ [illegible] ను? ఆబోద్ధుఁడేరు ?

రాజు—సత్యకీర్తి, చార్వాకుఁడు ముందునిలుపుఁడు.

వసు—నీపే నా చారాకుఁడు.

చారా—చార్వాకుఁడే నాపేరు.

సు—నా జ్ఞ స్వభావము మిగుల వింతగానున్న నీవు పత్రము ననుసరించు నాదల దే పు చ ములు ని న్నాటంక పెట్టనేరవు. నీ పితని బారిపడితివిగదా.

సత్య—అత డాలాగనుచున్నాఁడు.

సు—త్రమున కొప్పుకొనిరెు వా ?

సత్య—నే నొప్పు నిరెు ను.

స్పష్టముగును కాఁబట్టి.

ఆ. వె. శొద్ది యక్రమమునఁ బె మే లొడఁగూర్ప
మార్గవయ్య యొక్క మాఱు న్యాయ
శాస్త్రవిధుల నిపుడు శా యయ్యెడు నీ పి
శాచమునకు వక్ర చర్యలు గి.

వసు—అట్లు సేయువలను పడదు.

తే. గీ. మహిని నిర్ణీత శాస్త్రంబు మార్ప నెవని
తరము ? ముందుకు నిది యుదాహరణమగుచు
రాజ్యమునఁ దప్పు లెన్నైనఁ బ్రభవమొందుఁ
గాన నీదేశ శాస్త్రంబు కదపఁబడదు.

చార్వా—ధర్మదేవతయే తీర్పులకువచ్చినది. జముగా ధర్మదేవతయే. చిన్నవయసులో నెంతో తెలివిగల తీరరిపయిన నిన్ను నే నెట్లు గౌరవింపఁగలను ?

వసు— య్యా ! ఒక పత్రముఁ జూడనిమ్ము.

చార్వా—పూజనీయుఁడవగు నో శాస్త్రవేద్ధి ! ఇదిగోనండి.

(అని పత్రమిచ్చును)

వసు—(పత్రము చూచి) చార్వాకా ! నీసొమ్ము కు మూడురెట్లిచ్చెదమనుచున్నారు, అదిగో.

చార్వా ఒట్టు ఒట్టు స్వామిసాక్షి ! నా మన క్షి ర ముగా నడుతువా డువను ? ఈధర్మపురియఁ తయు ధారపో ను నడువను.

వసు—అ యిన నింకెందుకు ?

తే. గీ ౖ ఫు గడువు గాటిపైఁ బడియెఁగాన
న్యాయశాస్త్రం ప తి ననుసరించి
జైనునకు సత్యకీర్తి వ ంబుఁగోని
పేరుమాంసంబుఁ గొన నధికారమబ్బె.

చా శా ? కరుణాళుండవుగమ్ము. నీసొమ్మునకు మూడురెట్లుపుచ్చుకొని పత్రము రద్దుచేయ ననుమతింపుడు.

చారా —పత్ర కారిము ముట్టినపుడు.

చ. జ నుతిఁ న్న రి శాస్త్రమెఱింగి యదా ముం గను

రాజు— పో౽ శిష్యా, అట్లు చేయుము.

కా.సం—నిన్ను పిండముగా మర్చుట కిష్టము పురోహితు లందురు. నేనే శ్రీ కృష్ణి కాకి నైతి నేని నిన్ను రిస్తంభములకడకు గొనిచేర మతి పదిమంది నప్పగిందును.

(చార్వాకుఁడు నిష్క్రమించును)

రాజు—(వసుమతితో) నేడు మా వనమునకు విందునకై దయచేయఁగోరెదను.

వసు— నే నెంతో తొందరపనిమీఁద కాకాసురపురమునకుఁ బోవలయును. న్ను మన్నింపుఁడు.

రాజు—మీకుఁ దీక్షిక లేనందుకు విచారముగా నున్నది. సత్యకీర్తీ! ఈన్యాయవాదినిఁ దగినట్లు సంతోషపెట్టుము. నీ వెంతయిచ్చినను చాలదనియే నాయభిప్రాయము.

చంద్రి—మహా ! (రాజు పరివారము నిష్క్రమింతురు)

తే॥గీ॥ ఇటు మూడు వేల్మాడలు బుణము చేసి
హానికరమైన దండుగలోఁ బడక
నేను నాస్నేహితుండును నీదు బు
బలము చేతఁ ద క బైటఁబడితి మయ్య.

మరు పొందిన శ్రమకుఁ బ తిఫలముగా చార్వాకున కీయవ సిన మూడు వేలమాడ లు మరే నైకొని మమ్ముఁ గృతా ఁ జేయుఁడు.

సత్య—ఇంతతోఁ దీరునదా? మేము నిరంతము మీయెడల భక్తివిశ్వాసముల జూపవలసినవారమే.

వసు—సం షమే పారితోషికము. మిమ్ము వి పించినందుకు నాకె తో సంతోషమయినది. నామనసు మున్నెన్నఁ డిట్టి ప్రివ్యాపేక్షకలదికాదు. నన్ను జ్ఞాపకముంచుకొనుఁడు; మీరు నుము లుగాకే. నాకు సెలవు యచేయుఁడు.

చంద -మిత్రుఁడా మిమ్ము బ వంతపెట్టవలసి యున్నది ఈసొ .. రుసుముగాఁ గాక మి మమ్ము జ్ఞాపకముంచుకొనుటకైనను కృతజ్ఞతాపూర్వకముగా మే మిచ్చునది నైకొనుటకు బా ంచెదను. నన్ను క్షమించి దీనిని నిరాకరింపకుఁడు.

వసు—మీరు న ంత లవం పెట్టుచు రు కా నొప్పుకొ ెదను. (సత్య కీర్తితో మీకొఱ ంచుటకు మ చేరుకు దయచేయుఁడు (చంద మౌళితో) మీరు — దుఁ ఁగు ప్రేమను ఆయుం గరమును యచేయుఁడు. మీరు చేయి

వెనుకకుఁ దీసికొనియెద రేని నాకు మరేమియు వద్దు. నాపై మీకుఁ [illegible]
మీరు దాని నీయకపోరు.

చంద —అయ్యో! యీయుంగరమా! ఇది మిక్కిలి స్వల్పము. దీని నిచ్చు
టకు నాకు [illegible] గుచున్నది.

వసు—నాకు దానియం దభిలాష కలదు కావున నా కదియే కావలెను. [illegible]
మొకటి నాకక్కర లేదు.

చంద —దీనివిలువకంటె దీనియందు పేర్మికయాధిక్యము కలదు. [illegible]
శిలో వెతకి తకి మిక్కిలి విలువయిన యుంగరము కొని తమ కిచ్చెద. ఇంగుఁ
నన్ను క్షమింపుడు.

వసు—వాగ్దానముచేయుటలోఁగల సాహసము వితరణమునందు మీకు లేదు.
మీరు బల వంతపెట్టుటచే తీరా నేను నోరు తెఱచి యడుగగానే [illegible]
లేదంటిరి.

చంద—అయ్యో!

తే॥గీ॥ ఉం రంబు నాసతిచేత నొసఁగఁబడియె
నామె నా ప్రేమఁ దొడగుచు నమ్మకుండ
బరుల కీయకుండఁగ నెడబాయకుండ
నెంచుకొని ప్రమాణంబు సేయించుకొనియె.

వసు—ఈమిషచే వనేకులు పరుల కీయకుండఁ దప్పించుకొందురు. [illegible]
కీయుంగర మిచ్చిన దుకు మీ భార్య మీపై పగసాధించునా? [illegible]
వివేకురాలును నా [illegible]జ్ఞత తెలియని గాను నై యుండవలెను [illegible]
గా నుందురుగాక! (వసుమతి, [illegible])

సత్య—చంద్ర మాళీ! ఉంగర మిచ్చివేయుము. [illegible]
యు, ఆతని యాజ్ఞయు, నాలోచించి నీభార్యయొక్క [illegible].

చంద —వసంతకా! త్వరగా పరువెత్తి యాయనను కలిసికొని [illegible]
రమిమ్ము. నీకు సాధ్యమయినయెడ సత్యకీర్తి గృహమున [illegible]
త్వరగాఁ బొమ్ము (నిష్క్రమించును)

సత్యకీర్తి—మన మిక్కడనుంచి పోవుదము [illegible]
వారి యూరి కేగుదము. ([illegible])

శ్రీరస్తు

వ సు మ తి.

పంచమాంకము.

---

[ప్రదేశము—వసుమతీగృహారామము.
పద్మిని, ప్రభాకరుఁడు ప్రవేశింతురు]

ప్రభా—తే॥గీ॥ పండువెన్నెల కాయుచునుండె; మలయ
మారుత కరస్పర్శనమున భూరుహములు
చొక్కి మేను మఱచియున్న పక్కినవియు
చప్పుడేమియుఁ జేయక యొప్పుచుండె॥

ఇట్టిమనోహర మగు రాత్రియందె మనుష్యుఁడు కోటగోడల నెక్కి గుడారమున నిద్రించుచున్న యొక కాంతామణికై [illegible] ట్టూపవుచ్చెను

పద్మి—ఇటువంటి రాత్రినే [illegible]న్నొ కాంతామణి సింహపుజాడఁ గనిపెట్టి మంచుబిందువులచే దడిసిన పచ్చికపై పరుగెత్తినది.

ప్రభా—ఇటువంటి రాత్రియందు తన విటకాని సంకేతస్థలమునకు రమ్మని సముద్రపుటొడ్డున నిలిచి గడ్డిపరకతో నొకకాంత సంజ్ఞచేసెను.

పద్మి—ఇట్టిరాత్రులయందే వృద్ధుఁడగు భర్తను తరుణవయస్కునిఁ జేయుటకు మూలికల నొకకన్య పోగుచేసెను

ప్రభా—తే॥ ॥ పద్మినీకాంత తన భాగ్యవంతుఁడైన
తండ్రి నెడబాసి యిలువీడి ధర్మపురిని
దొలఁగి మోహవార్ధి మునింగి దొంగవలెను
నరయ నిట్టిరాత్రి మహేంద్రపురినఁ జేరె॥

పద్మి—ఇటువంటిరాత్రియందే ప్రభాకరుఁడు డామెకడ నెన్నో బాసలుచేసి లొంగదీసికొని మాయచేసి ముచ్చిలిపోయెను.

ప్రభా—తే॥గీ॥ పద్మినీకాంత గయ్యాళివలెను తనదు
నధిపతినిజూచి యుల్లసమాడుచుండ
గౌరవముతోడ దానిని గాదటంచు

ప్రీతి క్షమియించె నీ రాత్రినె వెలంది

పద్మి—ఎవ్వరును రాకుండిన నిట్టి సరససలాపములతో తెల్లవారనిత్తువుగా ఎవ్వరో వచ్చుచున్నట్లున్నది.

[భద్రుండు ప్రవేశించును]

ప్రభా—ఇంత నిశ్శబ్దముగానున్న రాత్రి నింతత్వరతో వచ్చువారెవ్వరు?

భద్రు—ఒక మిత్రుండు.

ప్రభా—మిత్రుండా! ఏమిత్రుండా! నీపేరేమి మిత్రుండా?

భద్రు—నా పేరు భద్రుండందురు. పుణ్యస్థలములం సేవించి సాష్టాంగనమస్కారములు చేసి నాయమ్మగారు తెల్లవాఱకమునుపే యిచ్చట నందురని వార్త తెచ్చితి

ప్రభా—ఆమెతో నెవ్వరువత్తురు ?

భద్రు—ఎవ్వరులేదు. ఒక సన్యాసినియు, ఆమె చెలికత్తెయు. అయ్యగారు వచ్చినారా ?

ప్రభా—అయనరాలేదు. ఆయనగూర్చి వర్తమానములేదు. పద్మినీ ! లోనికి బోవుదము. గృహయజమానురాలు వచ్చుచున్నది కాన గౌరవార్థముగా నింటి నలంకరింతము.

[గోపాలదాసు ప్ర॥]

గోపా—ఓరీ! ఒరీ! హో! హో! ఓరీ!

ప్రభా—ఎవ్వరు ?

గోపా—ఓరేయి! పద్మినీప్రభాకరులనుం జూచితివా ?

ప్రభా—ఆ కేక లెందుకు ? యిక్కడ నే నున్నాను.

గోపా—ఒరేయి ఎక్కడ ?

ప్రభా—ఇక్కడ !

గోపా—మంచి వర్తమానములతో నాయజమానుడుగారి వద్దనుండి నౌకరు వచ్చినాడని చెప్పు. తెల్లవారకమును పామున యిక్కడుందురు. (నిష్క్రమించును

ప్రభా—ప్రియురాలా! లోనికిం బోయి వారిరాక నిరీక్షించి యుండ ఖరవాలేదు. లోని కేల బోవలయును? ఈభద్రుం డేగి యజమానురాలు వచ్చుచున్నదని చెప్పి సంగీతమునకుం దగిన సాధనములం గొనితెచ్చును.

(భద్రుండు నిష్క్రమించును

ఈవెన్నెల యొంతో మనోహరముగానున్నది. మన మిక్కడనే కూర్చుండి శ్రవ
ణానందకరముగా వాద్యములు విందము. ఈచక్కని రాత్రియు ఈనిశ్శబ్దత్వమును సం
గీతమునకు వాద్యమునకు మఱింత వన్నె తెచ్చుచున్నది. పద్మినీ ఇక్కడనుండి చూడుము.

తే॥గీ॥ బృందావనంపుబంగారుచవ గూర్చినట్టి
మేలుజాతి వజ్రములు మెఱయునట్లు
చదునుగానున్న చక్కని చదలునందు
మెఱుపు కాంతుల తారలు మెరయుచుండె.

కాంతామణీ! కొందఱి మతానుసారముగా మనము చూచుచుండు గ్రహములు మిచుట్టును పరిభ్రమణము సేయునపుడు పాడెడు సంగీతము నిర్జరులగు దేవతలు శ్రవణానందకరముగా విని యానందింతురు. కాని కేవలము నాశనాకరమగు దేహాగారమగు మనము విని యానందింపలేము.

[వాద్యగాండ్రు ప్రవేశింతురు]

రండి చంద్రాధిదేవతను స్మరింపుడు మీయజమానురాలికి వినంబడునట్లు వాద్యములు వాయించి మంగళధ్వనులతో నామెను లోనికిఁ గొనిరండు.

పద్మి—ఎంతటిమనోహరమగు గానము విన్నను నాకు సంతోషము పుట్టదు.

ప్రభా—నీవును సంగీతమును విడిచిపెట్టుటయే కారణము. పోత్రపు పసులమందనుగాని మచ్చికచేయబడని గుఱ్ఱపుపిల్లనుగాని చూడుము. వానినిఁ గట్టిన ఱంకె వేయుచు సకిలించుచు గందరగోళము చేయును. అట్టివానికైనను, వాద్యధ్వనిగాని సంగీతముగాని చెవినిఁబడిన కదలక శ్రవణానందకరముగా విని మోటుతనము వీడి సాధుత్వము వహించును. ఇదే సంగీతమందలి మంచిశక్తి. కాళిదాసంతటి కవిసింహములు, పర్వతములను, ప్రవాహములను నున్నవి యున్నట్లుగా వర్ణింపఁగలరుగాని వాని సృష్టినే మార్చును.

క॥ తనము పాడక యుం ను
గానముచే మన సోకిం కరుగక యున్నన్
ఓ నలినాక్షీ యాతడె
తానిపుణుడు ద్రోహాచార్య తంత్రంబులకున్॥

వానియోచన లంధకార బంధురమగు రాత్రివలె నింపుగా నుండవు. వానిప్రేమ శుష్కమైయుండును, అట్టివాని నెవ్వరు నమ్మరు. ఆహా! సంగీతము వినుము.

[దూరముగా వసుమతీ చతురికలు ప్రవేశింతురు].

వసు—ఆ దీపము మానభవనమున వెలుగుచున్నది. దాని వెలుతు రెంతదూరము వ్యాపించుచున్నది! ఇట్లే దుష్టప్రపంచములో మంచికార్యము కూడ ప్రకాశించును

చతు—వెన్నెల కాయుచుండిన దీపప్రశోభ యేమి యుండును ?

వసు—నిజమే. అట్లే గొప్పమహిమ తక్కువదాని మఱుగుపఱచును. రాజప్రతినిధి రాజు చెంత లేకున్నంతవఱకు రాజువలెనే ప్రకాశించును పిదప వాని పని యుత్తదే చిన్ననది సముద్రములో కలిసి నశింపదా? ఆహా! సంగీతము.

చతు—దేవీ! అది నీగృహమందు వాయింపఁబడు వాద్యమే.

వసు—అభినివేశము లేనిది యేదియు నింపుగా నుండదు ఆగానము పగటివేళ కంటె రాత్రి మఱింత యింపుగా నున్నదనుకొనియెద.

చతు—దేవీ! నిశ్శబ్దత్వముచే దాని కానందము వచ్చినది.

వసు—శ్రద్ధగా వినకున్న భరతపక్షికూఁత వలెనే కాకికూఁతయు నుండును పగలన్ని పిట్టలతో బాటు పికిలిపిట్ట కూసినను శ్రావ్యముగా నుండదు. గానానుగుణముజట్టియు స్థితిగతులనుబట్టియు నేకావ్యమునకైన వన్నెవచ్చి సుశ్రావ్యమగును. ఉండుండుము. చంద్రుఁడు గ్రుంకుచున్నాఁడు (సంగీతము మానివేసెదరు.

ప్రభా—వసుమతీ కంఠనాదము వలె నున్నది. లేక పొరపాటుపడితినా?

వసు—కోయిల కంఠస్వరము గ్రుడ్డివాఁడైన గుర్తెఱుఁగునట్లుల ప్రభాకరుఁడు నన్నెఱుఁగును.

ప్రభా—దేవీ! నీకు స్వాగతము.

వసు—మాయుభయుల భర్తల క్షేమమునకై ప్రార్థించుచుంటిమి. మా వాక్యముల ప్రకారము జరుగును గాక! వారు వచ్చినారా?

ప్రభా—లేదు కాని వారు వచ్చుచున్నారని దూఁత చెప్పినాడు.

వసు—చతురికా! లోనికేగి మన ఎకులతో మన మిక్కడలేని సంగతి బయలుపు రావ ప్పము ప్రభాకరా? [illegible] పద్మినీ నీవుకూడ.

(తెఱలో ధ్వనులు)

ప్రభా—అమ్మా! నీభర్త చ్చుచున్నాఁడు గోవగారంభమోత. [illegible] దెమలు ప్పను. భ ము

వసు—ముబ్బువేన పటిపూటవలె రాత్రి యున్న .

[వసంతకుఁడు, చంద్రమౌళి, సత్యకీర్తి అనుచరులు ప్రవేశింతురు]

చంద్ర—ఆ॥ వె॥ స్వచ్ఛకాంతి వెలయు భానుఁడు గ్రుంగంగ
రాత్రియనఁ జాల జిత్రముగను
భామ ! నిన్నుఁ జూడఁ బశ్చిమగోశార్ధ
రాసులకును బోలెఁ బగలె మాకు॥

[ఆ॥ వె॥ నెలకు నొక్కనాఁడు వెలుగును చంద్రుండు
పూర్ణకళలతోడఁ బొలుపుమీఱ
భామ నిన్నుఁ జూడఁ బ్రతిరాత్రియును మాకు
పున్నమవలెఁ దోఁచి చెన్నుమీఱు॥]

వసు—మీకొంతం దాస్పదురాల నయినను చులకనగా జూడకుందురు గాక! చుంచకగుణముగల భార్య భర్తకు భారముగా నుండును. మీకట్లు నే నెప్పు డుండకుందునుగాక! మీకు స్వాగతము నాధా ?

చంద్ర—ప్రాణేశ్వరీ!

ఆ. వె. శుభము కలుగు గాక సుందరీ! యితఁడె
సత్యకీర్తి ప్రాణ సఖుఁడు నాకు
నెంతొ ప్రేమ తోడ నితనిఁ జూచుచునుందు
గౌరవింపవలయు ఘనముగాను.

వసు—ఆయన మీ నిమిత్తము చిక్కులుపడిరి కావున మీ రాయన కెంతయైన ద్ధులే.

సత—అవి యన్నియుఁ దొలంగినవి కావున నింక వాని నెంచనేల ?

వసు—అయ్యా! తమరాకచే మాగృహము పావనమయినది. కార్యములలోఁ గాన్పింప వలయునుగాని మాటలతో నేమి ప్రయోజనము.

(వసంతకుఁడు చతురిక పేరుగా మాటలాడుదురు)

వసం—చంద్రుని తోడుగ ఁ జెప్పుచున్నాను. న్యాయవాది లేఖరి కిచ్చితిని. న్నన్యాయముగా నెపపెట్టుచున్నావు నీ యుంగర మిచ్చినందుకు నీమనసు చాల నొ నది కావున నా యుంగరము గైకొనినవాఁడు గతించినను నేను చింతింపను.

వసు—అప్పుడే కలహమా ? సమాచారమేమి.

వసం—తే. గీ. "నన్నుఁ బ్రేమించు న న్విడ నాడఁబోకు"

కనుచుఁ బ్రేమఁ జెక్కఁబడియు నామె చేత
నొసఁగఁబడిన బంగారంపు టుంగరమునకుఁ
బోవుచున్నది పుష్టియు మునిఁగినట్లు

చతు—దానిపై వ్రాయఁబడిన వ్రాతకా? దాని విలువకా? నేను దానిని మీకిచ్చునప్పుడు ఆమరణాంతము దానిని మీరు ధరించి తుదకు సమాధిలోఁ బెట్టుకొనుటకై ప్రమాణము జేసితిరే, నానిమిత్తము కాకపోయినను మీరు చేసిన ప్రమాణముపై నయిన నాదరముంచవలదా? న్యాయవాది లేఖరి కిచ్చినారా? లేదు. దైవమెఱుంగ. డా మొగముపై నెన్నఁటికి శ్మశ్రువుదయింపని లేఖరికిచ్చితిరి.

వసం· ఆతనికి వయస్సు వచ్చి పెద్దవాఁడయినచో నవి రాఁగలవు.

చతు—ఆ! స్త్రీపురుషుఁడయి .

వసం—ఆకుఱ్ఱవానికి నా చేతతోనే నిచ్చితిని. పొట్టికుఱ్ఱవాఁడు. నీయంత పొడుగుండుఁడు. న్యాయవాది లేఖరి రుసుముగా నడుగఁగా నివ్వకుండ నుండలేకపోతిని.

వసు—మోమోటమి లేకుండఁ జెప్పెదను నీదే తప్పు నీభార్య నీకిచ్చిన ప్రథమాభరణము నీ మరణమువఱకు నీయొద్ద నుండవలసినదే. ఎన్నఁటి కెడబాయకుండునట్లు ప్రమాణము చేయించుకొని నా ప్రాణేశ్వరున కొక యుంగరమిచ్చితిని. ఇక్కడనే యున్నారు అడుగుము ఈప్రపంచమంత ధారపోసినను దానిని విడుతురా? వసంతకా? నీవు నిష్కారణము నీభార్యకు మనోవ్యాధి తెచ్చిపెట్టితివి నాకే యిదితటస్థమయినచోఁ బిచ్చియెత్తిపోవుదు.

చంద్ర—(తనలో) నాయెడమ చేయి కోసివేసికొని యుంగరమును రక్షించుకొనుటలోఁ దెగిపోయినదని తప్పించుకొన్న బాగుగా నుండిపోవును.

వసం—చంద్రమౌళిగారు తన యుంగరము న్యాయవాది కిచ్చిరి నిజముగా దానికిఁ దగినవాఁడు. ఆయన లేఖరి కొంతి వాసి జాడు గనుక రుసుముగా నాయుంగరమిచ్చితిని ఆయుంగరములు తప్ప మఱి వేనిని వారు కోరరైరి.

వసు—నాథా! ఏయుంగర మిచ్చినారు? నేనిచ్చినది కాదుగద.

చంద్ర—తే. గీ. నేను చేసితి తప్పు దానికిని ఆడు
గానొక యసత్యమునుఁ జేర్పఁ గలుగునేని
నే నదేమి యెఱుఁగనని నిబ్బరముగఁ

జెప్పవలసియుండను సదసీశసాక్షి.
నీవు చూచుచుంటివి. వ్రేలిని యుంగరము లేదు.

వసు—నీది నిజమయిన హృదయము కాదు. నాయుంగరమునుఁ జూచునంతకు నేను మీభార్యనగాను.

చతు—(వసంతకునితో) నాయుంగరముఁ జూచుదాఁక నేనును మీకటులే.

చంద్ర—వసుమతీ కాంతారత్నమా?

సీ. ఈవెతింగినయెడ నేమహాత్మునకు నే నొసఁగియున్నాఁడనో యుంగరంబు
ఈవెతింగినయెడ నెవ్వాని కొఱకు నే నొసఁగియున్నాఁడనో యుంగరంబు
ఈవెతింగినయెడ నేమి కార్యార్థమే నొసఁగియున్నాఁడనో యుంగరంబు
ఈవెతింగినయెడ నింతయిష్టములేక యొసఁగియున్నాఁడనో యుంగరంబు
అల్ల యుంగరమేతప్ప నన్యమేది
వద్దు వద్దని యాన్యాయవాది యనుట
నీవెతింగిన యెడనింత నీకు నిపుడె
కినుక నాపైనిఁ దగ్గకుండు నెలతాంగి.

వసు—ఆయుంగరము యొక్క యోగ్యతమీ రెఱింగి యున్నను ఆయుంగర మిచ్చిన కాంతయొక్క యోగ్యతతో సగమైన మీ రెఱిగి యున్నను, ఆయుంగరము ధరించిన మీకు గలుగు మర్యాద నెఱింగియున్నను, ఆయుంగరము మీరు విడువకయే యుందురు. వివాహ సమయములో భార్యచే నొసఁబడఁబడిన యుంగరము మీరు పట్టుదల గానీయ నప్పుడే మూర్ఖుఁడు దానినే యిమ్మని యడుగఁగలఁడు? దేనిని నష్టపలయునో చతురిక తెలిపినది. నాప్రాణముతోడు. నిజముగా నాఁడుదే యా యుంగర మందుకున్నది

చం, వ—కోమలీ!

తే. గీ. ప్రాణ మిత్రుని కాతఁడు ప్రాణమిచ్చి

---

పాఠాంతరము.

ఉ. ఎవ్వనిఁగూర్చి యెవ్వనికి నెందుకు నుంగర మిచ్చినాడనో
యవ్వర దీబలుండు తనకాభటు వేయిడఁ బట్టు పట్ట నే
నెవ్విధి నీయ నెంతటి యనిష్టముతో భటువిచ్చినానో నీ
వవ్విధి యంతవిన్న జల జానన కోపము నీకుఁ దగ్గెడున్,

న్యాయవాది నిరుత్సాహుఁ డైచనంగ
మొకటి భటుఁడీయ నన్న నా పిదపసిగ్గు
పడి కృతఘ్నుఁ డనుచ జడిసి పంపినాఁడ.

చ. తొలుత నొసంగఁ గుండీనను తోయిరుహానన మూఁడువేల మా
డలుగల మాటనీయఁగఁ గడంగిన వద్దని న్యాయవాది కా
వలయును నాకు నుంగ్రమని పట్టును బట్టఁగ నిచ్చినాఁడ నే
కలికికి నీయలేదు మృష కాదిది చెప్పెద నాత్మసాక్షిగన్.

ప్రియసఖీ! నేను కృతఘ్నుఁడనైన నీయుంగరము నాచేతనుండనదే. కాని నేనట్లు పించుకొనుట నాగౌరవమునకుఁ దగినది కాదు. నన్ను క్షమింపుము. దీపపు వెలుతురు సాక్షిగాఁ జెప్పుచున్నాను నీవే యక్కడనుండినయెడల న్యాయవాది కాయుంగ మిమ్మని ప్రోత్సహించి యుందువు.

వసు—ఆన్యాయవాది నాయింటికెన్నఁడును రావద్దు. నానిమిత్తము దాల్చెద నని మీరు ప్రమాణము చేసిరి, దానిని నేనెంతో ప్రేమించితిని. దానినే యాతఁ గైకొనెను. మీవలె నేనును సాహసికు రాలనగుదును, నాదగ్గఱ నుండునదేది కోరిన లేదనను.

చతు—వాని గుమస్తాను నేనును నన్ను మీరేలాగు నారక్షకు నన్న విడుతురో జాగ్రత్తగా ఆలోచించుకొనుఁడు.

వసం—ఆలాగు చేసెదవా? ఆగుమస్తాను నాకుఁ దొరకనీయకుము. దొఱ నట్లయిన నాతని వాగ్రీత భంగము చేసినవాని నగుదును.

సత్య—ఈతగు లన్నిఁటికిఁ గారకుఁడను నేను.

వసు—అయ్యా! మీరు చింతింపకుఁడు. మీ రెప్పుడును సమ్మానార్హులే.

చంద్ర—చ. సరియగు సూక్ష్మరూపమున స్వప్నము నాదగురూపుదాల్చు సుం
దరమగు నీ శా నయన బులుతోడు ప్రమాణవైఖరిన్
వరసఖు లింతమ ది వినఁ బల్కెదఁ బ్రోద్భల కారణంబుగా
చ గిన యట్టినేరము ప్రసన్నమతిన్ క్షమియింపుమానినీ.

వసు—అదియే ప్తి నంచుకొనుఁడు. నారె డుకన్నులలో మీరు రెండువి మాలుగా గన్పించుచున్నా . ంటి కో రూపుగా గాన్పింతు . మీమీఁ నే యొ పెట్టుకొనుఁడు. మంచిప్రమాణమగును.

చంద్ర—అదికాదు వినుము. ఈతఁడు నన్ను క్షమియింపుము. ఇంక ముందెన్నఁడును
లోఁ జేసిన ప్రమాణము తప్పనని యీ సాక్షిగాఁ బ్రమాణము సేతును.

సత్య—(వసుమతితో)

క ఈతని బుణముఁ బునకు నే
బ్రీతిని నామేను కొదువఁ బెట్టితి సుమ్మీ
యోతరుణీ భటువుఁ గొనిన
యాతని మూలమున గాని హానియొకలఁగుణ్.

నీప్రియవల్లభుఁడీసారి యుద్దేశపూర్వకముగా బ్రమాణము మీఱకుండుటకై నాప్రా
మే కొదవ పెట్టితిని.

వసు—అలాగయిన నీసారి మీరు పూఁచీపడి యీయుంగరమిచ్చి మొదటివాని
ంటె నెక్కుడు జాగ్రత్తగా నుంచుకొమ్మనుండు

సత్య—చంద్రమౌళీ! ఈయుంగరము జాగ్రత్తగా నుంచుకొనుటకుఁ బ్రమాణ
నేయుము.

చంద్ర—దైవసాక్షిగా (ఆశ్చర్యముతో నేను దీనినే నా యవాడి కిచ్చితిని.

వసు—నాథా క్షమింపుము. అతఁడు ని నాకిచ్చినాఁడు

చతు—(వసంతునితో) నన్ను క్షమింపుము. ఆనా యవా కడ నుండు పొట్టి
ఁడగు లేఖరి నా ది యిచ్చెను.

వసు—మీరంద ఆశ్చర్య మగ్నులయిరి. ఇదిగో యుత్తరము, మీకు దీటికకలి
నప్పుడు చదువుకొనుఁడు వాచాలుఁడుగారు పంపిరి. అందు వసుమతియే నా య
దియనియు చతురిక లేఖరియనియు మీరు గ్రహింతురు. ఈయంశమును ప్రభా రుఁ
ధృవపఱుచును. మీవెనువెంటనే నేనును బయలుదేఱి మీకంటెముందుగావచ్చితిని
ంకను లోనికి పోనేలేదు సత కీర్తి! మీకు మేలగుఁగాక. ఈయుత్తరము త్వరగాఁ
చుకొనుఁడు. మీ శుభవ మానము గలదు. మీయోడలు మూడు హఠాత్తుగా
ముతో నాకారత స్థానముఁ జేరినవని యిందు వ్రాయంబడియె. ఈయుత్తరము
చేతిలో నెట్లుపడెనో మీకుఁ దెలుపను.

సత్య—నాకు నోట మాటరాకున్నది.

చంద్ర—నీవేనా న్యాయవాదివి పోల్చుకొన లేకపోతిని.

వసంత—నీవేనా లేఖరివి. నేను పోల్చుకొనలేదు.

సత్య—తే. గీ. చాన! నీదు ప్రజ్ఞావిశేషంబుచేత
ప్రాణ జీవనంబులు నాకుఁ బ్రాప్త మయ్యె
నోడ్లు చేరె నొకలను చు సు రము
వ్రాయఁబడియు డెఁ చదివితి ప్రమదమునను.

వసు—ప్రభాకరా? నాలేఖరి కొక సుచా ర్త తెలుపుదును.

చతు—రుసు మక్కఱ లేకయే వార్త తెలిపెదను చార్వాకుఁడు గతించినపిదప

వానికుండు యావదాస్తియు నీకును నీప్రియసతికి నిచ్చుటకు వ్రాసియిచ్చిన దానప యిదిగో.

ప్రభా — కాంతామణులారా? ఆకలి గొన్నవారికి మృష్టాన్న భోజనమిడిరి.

వసు — ఉదయమగుచున్నది జరిగిన యంశములు మిమ్మాశ్చర్యమగ్నులగా జేయుటచే నమ్మజాలకుండిరి. మాయిలులోని కేసుదమునందలి మీసందేహముల నడుగు మేము విశ్వాసపాత్రముగా నుత్తరము లిత్తుము

వసం — మంచిది ఇంక నేను బ్రతికినంతకాలము చతురికాదత్తమగు నుంగరమును జాగ్రత్తగా దాచుటకు తప్ప మఱిదేనికి భయపడను.

× చ. అనని పసుస్తజంతువుల యాచము వ్రొల్చెను కంచమోయనన్
భువిని సమస్త జీవములు పుట్టుటకున్ బెరుగన్ నశింప హే
తువగుట దక్షుణంబున గుతూహలమిచ్చెడు దైవమోయనం
గవరలు లోకబాంధవుడు కన్నుల పండువుగాంగ దోచెనన్.

చంద్ర పరంగ సమస్తజంతువులు పాంథులు కాగ నగీతనాసుమే
సరకుగ చెల్లిదంపుకైట చాయయె ముందుగ వచ్చుధూమమే
పగిడు కాలము జాగబండికి గట్టిన యంత్రమోయనన్
బ గెడు సూర్యుడిన్ గనుల పండువుగా నుదయించెదూర్పునన్.

సత్య. ఇలలును గ్రమ్మిలోకమున కెంతో చికాకుగ నుండునట్టి రా
త్రిరి గతియింప భానుండురు తేజముతో నుదయించు మన్నెలన్
వివిధ నానా నొక్కమొగి పెక్కువిపత్తులు రాగగల్గు దు
ర్భరమగు వేదసాగరము బాయముపం బుదయించుచుండెడిన్.

ఇది ఆచంట సూర్యనారాయణరాజుచే నాంధ్రీకరింపబడిన
వసుమతీ నాటకములోని పంచమాంకము

---

× గ్రంథమున లేనివి.



సమాప్తము.

